వెల:
0—6—0,

రెండవ కూర్పు
1000 ప్రతులు.

ప్రకాశకులు
కొల్లూరి సుబ్రహ్మణ్యాం.



దొరయువారు:—
శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్ డిపో,
రాజమండ్రి.

శ్రీరస్తు.

# మణిమంజరి.

## మొదటిప్రకరణము.

దిగంతవిశ్రాంతకీర్తి యగు విక్రమార్క మహారాజు మహానగర మను నుజ్జయని రాజధానిగఁ జేసికొని యేకచ్ఛత్రముగ దేశమును బరిపాలించుచు నొక్కనాఁడు మంత్రులు సేనాపతులు కవులు గాయకులు రాయబారులు పండితులుఁ బరివేష్టించియుండ నఖండవైభవమున నిండుకొలువుండి బహుప్రసంగంబులు సలుపుచుండ నడుమ "భూలోకమున నీకాలమున సీతా దమయంతీ చంద్రమతీ లోపాముద్రానసూయారుంధతీ ప్రముఖులగు మహాపతివ్రతలుగలరా" యని ప్రశ్నము వచ్చెను. అటువంటి పతివ్రత లీకలియుగమున లే రని యాకొలువులో నున్న సింధురాజు పలికెను. కవిచాతుర్యమేగాని యేకాలమున నట్టిపతివ్రతలు లేరనియు, నుండుట యసంభవ మనియు నొకవేళఁ బూర్వముండినను నేటికాలమున నెక్కడను లే రనియు లాటదేశాధీశ్వరుఁ డగు చంద్రకేతుఁడు పలికెను. "దేశము గొడ్డుపోలేదు. సుగుణవంతులు దుర్గుణవంతులు ప్రపంచ మున్నంతకాల ముందురు. అట్టివారొక యుగములోనుండి యొకయుగములో నుండకపోరు. ఈయుగములో నీకాలములోఁగూడ మహాపతివ్రతలు చాల మంది గలరు. లే రనుట కేవలము పొరబాటు. పూర్వ ముండి రని వర్ణించుట కవిచాతుర్యము గాదు. అతిశయోక్తి గాదు. సన్నుతింప వలయుననునభిలాషగాదు. వ్యాసవాల్మీకిప్రముఖు

లగుమహర్షులు సత్యమునకు దూరము లగువర్ణనలువర్ణించి జను
లను భ్రమపెట్ట దలంచుకొనలేదు. అట్లు భ్రమపెట్టుటవలన వా
రికి వచ్చిన లాభము లేదు. అట్టి జగదుపకారపరాయణులను
నిందించుటధర్మముకాదు." అని విదర్భనరపాలుం డగు మకరం
దుండువక్కాణించెను. ఈమాటలు వినగానే చంద్రకేతువు కోపో
ద్దీపితుండయి నిప్పులు ద్రొక్కిన కోతివలె గంతులువేయుచుం
జేతులుసాచి మకరందు నధిక్షేపించుచు నిట్లనియె. "మకరంద
మహారాజు విద్యాసంపన్నుండేగాని లోకానుభవ మించుకేనియు
లేనివాండగుట వీనివాదముచేతనే స్పష్టమగుచున్నది. ఎక్కడిస్త్రీ
లెక్కడి పాతివ్రత్యము! పాతివ్రత్యము మహర్షులు వ్రాసిన
పుస్తకములలో నున్నది. లోకానుభవములేని మూఢుల మనస్సు
లలో నున్నది. రూపములేనిస్త్రీలయం దున్నది. అంతేకాని లోక
మునలేదు వీలులేక కొందఱు స్త్రీలు, తమవృత్తము బయలంబ
డునని కొందఱు స్త్రీలు, అప్రతిష్ఠలు సంభవించునని కొందఱు
స్త్రీలు, కులమువారు వెలివెట్టుదురని కొందఱు స్త్రీలు, పరపురుష
సహవాసముసేయక యుందురుగాని మనస్సులలో వాంఛలు లేక
గాదు. వీలుగల్గినపక్షమున నొక్కపతివ్రతయు లోకముననుండదు.
మంచిపువ్వువాసన చూడ దలంపనివారు, రుచివంత మగువస్తువు
భక్షింపంగోరనివారు, సువస్తువులం జూడ నపేక్షింపనివారు లోక
మున నుందురా! అట్లే సత్పురుష సమావేశమైనప్పుడు తత్సాం
గత్యము సేయంగోరని యంగనయుండుట యసాధ్యము. పురుషు
లేవిధముగా ననేకస్త్రీలను వివాహమాడి భోగపరాయణు లగు

చున్నారో స్త్రీలుఁగూడ నట్లే బహుపురుషసహవాసము సేయ వలయునని కోరుచుందురు. కాని బలవంతులమగుటచే మనము యథేచ్ఛముగాఁ జరించుచున్నాము. వా రబలలగుటచే మనము వారల నంతఃపురముల బంధించి పరపురుషుని జూచుటకుఁగాని మాటలాడుటకుఁగాని స్వేచ్ఛగా విహరించుటకుఁగాని యవకాశము లియ్యకపోవుటచే వారు పతివ్రత లగుచున్నారు. ఇందుచేత నిది భ్రమకాని వేరుకాదు." అనవుడు వానిమూర్ఖతకుఁ జిఱునవ్వునవ్వుచు మకరందభూపాలుఁడు మెల్లగ నిట్లనియె. "లాటరాజా! నీవాదములు నాకు మిక్కిలి మనఃఖేదములఁ గల్పించు చున్నవి. కామిలరోగము గలవానికి జగమంతయు బచ్చనై దోఁచునట్లు ధర్మశూన్యమైననీమనంబునకు లోకమందలి స్త్రీలందఱు జారిణులయి కానఁబడుచున్నారు. నీమాటలు మహాపాతకహేతువులు. మనకీదేహము బ్రసాదించిన మాతృదేవతలను నీవిధముగా నిందించుట పరమపాతకముగాక మఱియొకటి యగునా! మనవంటి దుష్టచిత్తులకు జన్మ ప్రసాదించినందులకు వారట్లు నిందలపాలు గావలసినదే. ఇప్పుడీ వితండవాదము లెందునకు. లోకమునం దనేక పతివ్రతలు గలరు. అట్టివారిని నేను జూపఁగలను."అని పలుకుచు మాట ముగింపక మున్దే చంద్రకేతుఁడు వేటువడినపామువలె చివాలునలేచి "పతివ్రతలున్న పక్షమున జూపుము. చూపిన నాశిరస్సు నే నిచ్చెద. చూపకున్న నీశిరస్సు నీవియ్యవలయును. ఈవిక్రమార్కమహారాజు నెదుట నట్టిప్రతిజ్ఞ చేయుము." అని శింగమువలె

బొబ్బరించెను. అప్పలుకులువిని మకరందుఁడు మందహాసముచేసి యీప్రతిజ్ఞ చేయుటకు నాకాటంకములేదు. నేనోడిపోయినపక్షమున పతివ్రతలులేనిదుష్టలోకమున జీవించుటకంటెమృతినొందుటయె మేలుకావున నాశిరస్సునేనిచ్చెద.”నని పౌరషమునం బలికెను.

---

## రెండవ ప్రకరణము.

చంద్రకేతుమకరందుల వాదములు ప్రతిజ్ఞ విని విక్రమార్క మహారాజు మిక్కిలి యాశ్చర్య పడెను. సభాసదులందఱు గరము విస్మృతు లయిరి. అయ్యుభయరాజులబంధువులు ప్రతిజ్ఞలం దలంచి యెవనికిం దలకొట్లగునో యని భయపడిరి. ఒక్కనిమిషమువఱకు సభయంతయు నిశ్శబ్దముగ నుండెను. అప్పుడు చంద్రకేతుఁడు మకరందునిఁజూచి యిట్లనియె. “విదర్భరాజా! బీరములుచాల పలికితివి. నీపంతము నెగ్గించుటకయి యెక్కపతివ్రతం జూపుము. చూపుటకాదు పేర్కొనుము. ఆమె పతివ్రత కాదని నేను ఋజువు చేసెదను. ఆమెపతివ్రతయని నీవు సిద్ధాంత పఱచితివేని నేను శిరచ్ఛేదమున కంగీకరించెదను.” అనవుడు విదర్భరాజిట్లనియె. “ లాటరాజా! పతివ్రతల నిమిత్తమై యెక్కడకో బోవనక్కఱలేదు. నీభార్య పతివ్రత. నాభార్య పతివ్రత. శ్రీవిక్రమార్కుని యంతఃపురము పతివ్రతామయము. సింధురాజు మందిరము పతివ్రతామయము. వేర దీనిని ఋజువుచేయవలసిన యవసర మేమున్నది.” ఆపలుకులువిని చంద్రకేతువు వికవికనవ్వి “తన భార్యపతివ్రత యని

ప్రతిమనుష్యుఁడు నమ్ముచుండును. అట్లు విశ్వసింపనివాఁడు మను ష్యుఁడు బ్రతుకుట యెట్టిది. స్త్రీలమాయలు మగవానికి దుర్గ మములు. స్త్రీలు తమ శృంగార చేష్టలచేత చిఱునవ్వులచేత, విలాసములచేత, విన్నాణములచేత, పొలయల్కలచేత, బుజ్జగిం పులచేత, దమ పురుషులను దమవలలలో వేసికొని సొక్కించి సోలించి భ్రమపెట్టి, మతులు విఱచి తమకంటె శరణ్యము పురుషులకు వేఱలేదను నమ్మకము కలిగించి తమ గులాముల సేయుదురు. అట్టి గులాములు తమ యేలికసానులగు నిల్లాండ్రు మహాపతివ్రత లని నమ్ముటలో నేమి యాశ్చర్యమున్నది. వేయి మాటలేల? నన్ను మీరు మూర్ఖుఁడనుకొన్నను సరే! దుర్మార్గు డనుకొన్నను సరే. నాప్రతిజ్ఞ వినుము. నీ భార్య పతివ్రతకా దని యీవిక్రమార్కమహారాజు మనస్సునకు నచ్చునట్లు సింధు రాజు మొదలగుసామంతులు భళీ యని నన్ను మెచ్చునట్లు నీవు సయితము నామాట నిక్క మని నమ్మి యింతకాలము మోస పోయినందునకు వగచునట్లు నీభార్య పతివ్రతకా దని నీకును నీసభవారికి విదితముచేసెద. అట్లు చేయనైతినేని యీ విక్ర మార్కదేవుని తలార్లు కొబ్బరిపుచ్చె నూడదీసినట్లు నాతల నూడ దీయుదురుగాక! ఇందు నీవోడితివయేని చిమ్మిలిగొట్టములనుండి వెడలువసంతము వోలె నీకంఠనాళములనుండి క్రొత్త నెత్తురు ప్రవ హించునట్లు నీశిరచ్ఛేదంబుఁ జేయించెద. నీ విక్కడనే యుండుము. నేను మూడుమాసములలో నాప్రతిజ్ఞ నెరవేర్చుకొని యిక్కడకు వచ్చెదను. ఇంకనాకు సెలవిండు." అనిపలికి విక్రమార్కుని

రియొద్ద సెలవుగైకొని యవ్వీలకుం జనెను. మంకరంద . మహా రాజు పరమసాధువనియు నతని ధర్మపత్నియగు "మణిమంజరి" మహాపతివ్రతయనియు విక్రమార్కుఁడెఱుఁగును. రాజుమొదలగు సహవాసు లెఱుఁగుదురు. అందుచేత విదర్భరాజు తనపంతము నుదప్పక నెఱవేర్చుకొను నని విక్రమార్కుఁడు నమ్మి వానినామూఁడుమాసములు తనయాస్థానమందె యత్యంతగౌరవముతో నిలుపుకొని యుండెను. అతనిమిత్రులందఱు లాటరాజు తప్పక యోడిపోవునని నిశ్చయించుకొనిరి.

అటుల లాటరాజు సభవిడిచి స్వదేశంబునకుం జని స్వనగరంబుఁ బ్రవేశించి స్వమందిరంబుఁ జొచ్చి శయ్యాతలంబునంబవళించి తనకావించిన దుస్తరప్రతిజ్ఞలు మనంబలముకొన నిట్లు వితర్కింపఁజొచ్చె. "కటకటా! నేనెంతదుండగమున కొడిగట్టితిని. విదర్భరాజు పట్టమహిషియగు మణిమంజరి సద్గుణమణిమంజరి యని జగత్ప్రసిద్ధము. అట్టి మహాపతివ్రతనుఁ బతివ్రతగాదని దూషించితిని. ఇదియొక మహాపాతకము. పాతకము మాట యటుండనిమ్ము. మహాచక్రవర్తి యగు విక్రమార్కమహారాజు నిండుకొలువుకూటమున నట్టి ప్రల్లదంబులు పలికిన నాకుఁగలుగు నపఖ్యాతియింతింతకాదుగదా! పోనీ, యపఖ్యాతి కేమి? ఒడలెఱుఁగక నావాక్యములువ్రేలి ప్రాణముమీఁదికి దెచ్చుకొంటినిగదా! అగ్నిహోత్రమునంటి యామణిమంజరీదేవి పాతివ్రత్యము నేను కళంకితము సేయగలనె? సూర్యచంద్రులు గతులుఁ దప్పిన బ్రహ్మాండము తలక్రిందు లైన నమ్మహాదేవి

తనశీలముం దప్పునే ! ధర్మము పరిత్యజించునే ! కడుదుర్మార్గుఁడ
నయి నేననార్య మగుకార్యమున కొడిగట్టితిని. ప్రతిజ్ఞాపరిపాల
నమున కై నేను మఱియెన్ని దుష్కార్యములు చేయ వలసి
యుండును. ఆదార్జన్యములనెల్లఁ జేయుదునా ? లేక నేనీవఱకు
గావించినదుండగముల క్షమియింపు మని కరుణామయుఁడగు
మకరందుని పాదపద్మంబుల పయిఁబడి శరణంబు వేఁడుదునా ?
ఛీ ! ఏమిది ? పౌరుషంబు నన్ను విడుచుచున్నది. సకల సామంత
రాజపరివేష్టితుఁడగు విక్రమార్క మహీపాలుని నిండుకొలువున
నట్లు ప్రతిజ్ఞలు పలికి యిప్పు డిట్లు వెంగలినై యుత్సాహంబుఁ
జంపుకొని పందనై పరువు నశింపఁ జేసికొనుట నాకుం దగునా ?
గుండెఱాయిఁ జేసికొని మనస్సు వశముచేసికొని యీమెపాతివ్ర
త్యముం జెరుపుటకు నాప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకు బ్రయత్నింప
వలయు. ఇదియే ముమ్మాటికి నిశ్చయము."



## మూఁడవప్రకరణము.

అని వితర్కించుకొని చంద్రకేతుఁడు తన యంతిపురము
విడిచి పోదలంచి యెచ్చోటికి దానఱుగుచున్నదియు నెవరికిం
తెలియనియ్యక నమ్మికగల యిరువురుబంట్ల వెంటబెట్టుకొని
మారువేసము వేసికొని యర్ధరాత్రమున రాజధాని విడిచి
వెళ్ళెను. విడిచి వెళ్ళునప్పుడు మంత్రుల నిద్దఱిం బిలిచి తాను
మరల వచ్చువఱకు గడుప్రయత్నంబున రాజ్యంబును సంరక్షించ
వలయునని యాజ్ఞ యిచ్చెను. ఇచ్చి తన గమ్యస్థానము

హారి కైన దెలియనియ్యక పయనమై మారువేసముతో నున్న దన్నెవ్వరు నానవాలు పట్టకుండ తప్పుదారుల నడిచి విదర్భా పురమునకుం జనియెను. చని బాటసారులు దిగు సత్త్రింబున బసచేసి రాజాంతఃపురసేవకులతో మెల్లమెల్ల మైత్రిసేయ బ్రయత్నించుచుండెను. మణిమంజరీదేవికి రాజముఖి కళావతియను నిరువురు చెలిమికత్తెలు గలరు. రాజముఖి మణిమంజరీదేవి పుట్టినింట నుండి యరణముగఁ బంపఁబడిన చెలికత్తె. ఆమెకు రాణికి నొకటే ప్రాణము. రాణినిమిత్తము ప్రాణములనైన నామె ధారవోయును. కళావతి విదర్భరాజు గృహమునందె చిన్ననాటనుండి పెరిగినయంగన! ఆమెకు రాణీయం దతిప్రేమమె కాని రాజముఖి యందు రాణికెక్కువ పక్షపాతమున్నదని యామె మనసులో గట్టి యనుమాన ముండుటచే నప్పుడప్పు డామె రాజముఖితోఁ గలహించుటయు నదికారణముగ మణిమంజరీదేవిపై నలుగుటయుం గూడ గలదు. ఒకనాఁడు మణిమంజరి మేఁడమీఁదఁ గూర్చుండి కన్నుల నిండిన బాష్పములు చీఱచెఱఁగుతోఁ దుడుచుకొనుచుండెను. అప్పుడు రాజముఖి దేవినిఁజూచి యిట్లనియె. “అమ్మా! కారణము లేక యిత్తెఱంగున మీరు విచారింపనేల? ప్రియసఖి నగు నాకు విషాదకారణము నెఱింగించెద వేని నీచింతఁ బాపుటకు నాశక్తికొలఁదిఁ బ్రయత్నించెద. నాకన్న నీకెక్కువ చెలిమి కత్తెలు లేరుగదా. కావున నీవిచారకారణము సత్త్వర మెఱిగింపుము.” అనవుడు మణిమంజరి “చెలీ! నీకంటె ప్రియసఖి లేదన్నమాట నేనెఱుంగుదును. నావిచారకారణము నీవెఱుం

గనిది కాదు. భర్తగారు విక్రమార్క మహారాజు నాజ్ఞా ప్రకార
ముజ్జయిని కరిగి యెన్నోదినము లైనది. నిన్నరాత్రి పీడకలఁ
గంటిని. ఆపాడుకలఁ గన్నది మొదలు నామనంబు పరిపరి విధం
బుల శంకాసంకులిత మైయున్న యది. అందుచేత నామనసు
మనసులో లేదు." అని పలికి వలవల యేడ్చెను. రాజముఖి
యామెపైఁ జేయివైచి "అమ్మా! రాజకార్యముల మీద నరి
గిన భర్తగారు కొంతయాలస్యము జేసిరనుటలో నాశ్చర్యమేము
న్నది? వారచిరకాలములోనె వత్తురు. వారు క్షేమముగానె
యున్నారు. నీవు వగవ వలసిన పనిలేదు. ఊరకుండు" మని
యోదార్చెను. ఆపలుకులువిని కళావతి మొగము చిట్లించుకొని
దెప్పుచున్న స్వరముతో నిట్లనియె. "అమ్మా! భర్తగారు లేకు
న్నను మరియెవ్వరు లేకున్నను నీకుభయములేదు. అందఱికంటె
నెక్కువదియై ప్రాణములకంటె నెక్కువదియై భర్తకంటె నెక్కు
వదియై నీకురాజముఖి యుండనే యున్నది. అదే నీకు తల్లి తండ్రి
దైవము గురువు అక్క చెల్లెలు భర్త బంధువు. దాని ముందర
మేమందఱముఁ గొరగాని వారము. అందుచేత నీవు విచారించ
వలసిన పనిలేదు." అప్పలుకులువిని దేవి "దానినైజ మెన్నడు
నిట్టిదె." యనితనలో విసువుకొనియూరకుండెను. రాజముఖియట్టు
లూరకుండక పరిహాసాస్పదముగఁదలయూచి "కళావతి! దెప్పుటకు
నీకుమంచి సమయము దొరికినదే? ప్రాణేశ్వరుఁడు సన్నిధానమున
లేక యీమహాదేవి పరితపించుచుండ నిట్లు నిష్ఠురోక్తులాడుటకు
నీకు నోరెట్లాడినదే. దేవి వగచుచున్నప్పుడు మనమూరడింపవల

సిపవారము గాని దెప్పవలసిన వారమా? నీవు మొట్టమొదట నుండియు నిట్టి యవివేకపుఁ బలుకులే పలుకుచుందువు. కావున నికనైన నాల్కకు కొంచెము బుద్ధి చెప్పికొని యూరకుండుము. ఇదివఱకే వగచుచున్న దేవిగారి దుఃఖమును నీవధికముచేయకు' మని మందలించెను. ఆమాటలువినగానె కళావతి మహాకుపితయై కలహింపజొచ్చెను. మాటపై మాటవచ్చెను. క్రమక్రమమున మాటలు తిట్లయ్యెను. తిట్లు దెబ్బలుగాకుండ మరికొందఱు పనికత్తె లడ్డువచ్చి నివారించిరి. మణిమంజరి వారినిద్దఱ నేమియు ననఁజాలక కన్నులప్పగించి చూచు చుండెను. అప్పుడు కళావతి మహాకోపోద్దీపితయై "రాజముఖీ! ఈవఱకెన్నోసారులు నీకును నాకును నిట్టికలహంబులైనవి. ఈదేవి పుట్టినింటినుండి వచ్చితి నని నీవు తెగనీల్గుచుందువు. నీ తెగనీల్గు నీయమ్మపాలుపెరుగుఁ బోసి పెంచుచున్నది. వా రుదాసీనులగుటచే నీ తెగనీల్గు నానా టికి హెచ్చుచున్నది. ఏమిచూచుకొన్న త్రుళ్ళిపాటో, ఏమి చూచుకొన్న గర్వమో, నాకేమియుఁ దెలియదు. నన్నొక పురు గులాగునఁజూచుచున్నావు. పురుగుకన్న నీచముగఁ జూచుచు న్నావు. నీయంతదానవు నీవు నాయంతదానను నేను ఇద్దఱము పనికత్తెలమే. నీకైశ్వర్యములేదు. నాకు దారిద్ర్యము లేదు. నీవన్న పాడుమాటలన్నియు నేను పడవలసిన యవసరములేదు. దీనితో నెందు కెందు కని యూరకుండినకొలది నక్లైరునూనికి బండివచ్చినట్లు మాటిమాటికి నాపైఁ బడుచున్నావు. ఈదేవివద్ద మనమిద్దఱ ముండుట పొసఁగదు. నీవైననుండవలయు నేనైన

నుండవలయు. మణిమంజరీ దేవీ! నీవెవ్వఱు నుండుమన్న వారి ముండుదుము. నీయభిప్రాయ మేమో చెప్పుము" అనవుడు దేవి యిట్లనియె. "పిచ్చిదానా? కళావతీ! నీవు నావద్దనుండి వెళ్ళిపో వలసిన యవసరములేదు. మీరిద్దఱు నావద్ద నుండవచ్చును." అనగానె కళావతి "యిదిమాత్రము సరిపడదు. నేనిక్కడ నుండ జాల" నని చివాలునలేచి వలదువలదనిపనికత్తెలు వారించుచు న్నను వినక దేవి మంచముమీఁదనుండి లేచిపోవలదు పోవలదని బిగ్గరగాఁ జెప్పుచున్నను చెవిబెట్టక విసవిసనడచి మందిరమువిడిచి యావలకుఁబోయెను.



నాల్గవప్రకరణము.

మణిమంజరీ దేవి పాతివ్రత్యముఁ జెరుపుదునని ప్రతిజ్ఞ పట్టి చంద్రకేతువు విదర్భకు వచ్చి యొక సత్రమునందు బసచేసి రాజాంతఃపుర సేవకులతో మైత్రిసేయఁ బ్రయత్నించుచుండెనని యిదివఱకె చెప్పియుంటిమి.. కళావతి విదర్భరాజు సంతఃపు రము విడిచి కోపముతో సత్రముదాటి యెక్కడకో వెళ్లుచుం డెను. చంద్రకేతుఁడు సత్రపుటరుగుమీఁద గూర్చుండెను. అప్పు డొక ముసలిది "కళావతీ కళావతీ" యని దానిఁబిలువ తిరిగి చూచి "ఓహో! నాపినతల్లి చండియా? ఏమే? యెప్పుడువచ్చి తి" వని పలికి దానిని సమీపించెను. అప్పు డన్యోన్య క్షేమ ములనడిగికొని వారిద్ద రిష్టగోష్టి మెలగుటలోఁ గళావతి రాజ మందిరమున నుద్యోగమును మానికొనుట బయలుపడెను. అప్

లుకులు చెవినిబడగానే చంద్రికేతునకు బరమానంద మయ్యెను. కూర్చున్నచోటునుండి చివాలునలేచి కళావతిని జూచి యది వఱకామెను దానెఱుంగకున్న నెఱింగినవాడువోలె చంద్రికేతుండు పేరునం బిలిచి యిట్లనియె. "నీవు విదర్భరాజుమందిరమున గొలువు మానితివని విచారింపకుము. లాటరాజునకునాకుం జాలస్నేహము. ఆయనయేనేను నేనే యాయనయని చెప్పవచ్చును. అతని యంతఃపురమున నీకుగొలువు విప్పించెదను. ఆయనరాణి మిక్కిలి యోగ్యురాలు. పనికత్తెలను కన్నబిడ్డలవలె నాదరించును. నామాట నీవు నమ్ముదువో లేదో; ముందుగానె యీనూరురూకలు నీవు పుచ్చుకొమ్ము. నీవు చంద్రికేతునింట సేవజేసినను జేయకపోయినను సరే యీరూకలు నీవే. మేము మరల గ్రహింపము" అని రూకలు మీఁద పారవైచెను. ఆధనముఁ జూడగానె దానికన్నులు చెదిరిపోయెను. కాని గడుసు దగుటచేతను నాగరికులతోఁ జిరకాల మంతఃపురమున సహవాసముఁ జేయుటచేతను మొదట తన కక్కఱలేదని బెట్టుసరి చేసెను. కానియెట్టకేలకు చంద్రికేతుని బలవంతముచేతను బినతల్లి ప్రోత్సాహముచేతను ధనమును స్వీకరించి రెండుమూఁడు మాసములు పోయిన తరువాత బయలుదేఱి లాటదేశమునకు వచ్చునట్లు చెప్పెను. చంద్రికేతుఁ డట్లేయగుఁగాక యని దాని నప్పటికిఁ బొమ్మని మరునాడుదయమున రమ్మనెను. చిత్తమని కళావతి వెడలిపోయి మరునా డుదయమున దర్శనముఁ జేసెను. అప్పుడు చంద్రికేతుండు దానికి మరల నేఁబది

రూకలు కొన్నినగలు వారితోషికముగనిచ్చి కల్లబొల్లిమాటలు కొన్ని చెప్పి దానిని మరల కనబడుమని యానతిచ్చి పంపెను. రూకలమీఁద రూకలు బహుమానముల మీఁద బహుమానములు వేడుకొనకయె వచ్చుచుండుటచేఁ గళావతి తియ్యనీటికిఁ జేఁపయెక్కిన చందమున జంద్రకేతుని సమీపమునకు మాటిమాటికి రాఁజొచ్చెను. అట్లు పదిదినములు గడచిన తరువాత నొకనాఁడు చంద్రకేతుఁడు దానిఁ జేరఁబిలిచి దగ్గఱ గూర్చుండఁబెట్టుకొని యిట్లనియెను. "కళావతీ! ఈపదిదినములనుండియు నేనెవఁడో యొక సామాన్యపురుషుఁడనని నీవు భావించునట్లు ప్రవర్తించితిని. నేనే లాటదేశపు రాజును. నన్ను చంద్రకేతుఁడను. నేనుజ్జయినీపురమున విదర్భరాజుతో నీపురమున బతివ్రతలు లేరని వాదించి యాతనిభార్య పతివ్రత కాదని ఋజువుచేయఁగలనని ప్రతిజ్ఞ లుబలికి వచ్చితిని. అట్లు నేను చేయనైతినేని నాకు శిరచ్ఛేదము జరుగును. ఆమె పతివ్రత కాదని మనమిప్పుడు ఋజువుచేయవలె. దీనికినీవు సహాయము నీవు చేయవలెను. దానికంటె నూరురెట్లు ధనమధికముగానిచ్చెద. ఇంక భూషణములిచ్చెద. నామాట నిలువఁబెట్టుము. నాప్రాణముఁ గాపాడుము. అంతఃపుర రహస్యము లన్నియు నీ వెఱుఁగుదువు. ఈపురమునం బతివ్రత లని చెప్పఁబడుచున్న యనేకస్త్రీలు నిజముగా బతివ్రతలు కారు. ఈమణిమంజరి యెట్టిది. దాని శీల మెట్టిది. నాకంతయు నెఱిఁగించి యేదో కడతేరునట్లు చేయుమని యాచించెను

జెప్పుము. ఇవి కాళ్లుగాని చేతులుకావు." అని దాని రెండుచేతులు బట్టుకొని వేడికొనియెను.

ఆపలుకులు వినగానే కళావతి శరీరము కంపించెను. గుండె జల్లుమనియెను. రాకలకై యాసపడుటచేత నసాధ్యకార్యము పై బడినదని యామె మనంబున భయపడెను. వెంటనే లోలోపల నెన్నోయూహాలు దోచెను. ఒక్కనిముస మూహాలలో మునిగి కొంతసేపటికి కిట్లనియె. "రాజేంద్రా! ఇదివఱకు నీవుచేసిన ప్రీతివల్ల నీతల దెగిపోవును. ఈమాటలవలన నీతలయు నాతలయుఁ గూడ తెగిపోవును. మణిమంజరి యన నేమనుకొంటివి? సద్గుణమణిమంజరి. సీతవంటి పతివ్రత. చంద్రమతివంటి పరమసాధ్వి. దమయంతివంటి పవిత్రశీల. అరుంధతివంటి యగ్నిశిఖ. అనసూయవంటి యకళంకచరిత్ర. ఆమె పతివ్రతకాదని ఋజువు చేయుటకు నీతరముగాదు కదా. నీతాతతరము గాదు. నిన్నుఁ బుట్టించిన జేజేల తరము గాదు. ఆమె పరపురుషునితో బలుకనొల్లదు. అన్యమానవుం జూడ నొల్లదు. అట్టిగుణరాశిని గుణహీనయని నీవెట్లు ఋజువు చేయఁగలవు? ఈవలవని కార్యమునం జొరబడుట గంగిగోవు కుక్కయని నిరూపింపఁ జూచుట. కల్పవృక్షము తుమ్మచెట్టని ఋజువుచేయబూనుట. సంపంగిపువ్వు నుమ్మెత్తపువ్వని చెప్ప సాహసించుట. మదగజ మూరపందియని వాక్రుచ్చుట. చాలు రాజా నీప్రయత్నము చాలు. మారు మాటాడక వచ్చినదారిం జనుము. గోడలకు చెవులుండును. రాజభటు లెవ్వరైన

నీదుష్టప్రలాపములు విన్నపక్షమున నెప్పుడో నీశిరస్సు పోవు
మాట యబద్ధమై యిప్పుడే నీశిరస్సు నీదేహమునకు దూరమగు
గును." అనవుడు చంద్రకేతుఁడు కొంతసేపు కిమ్మనక యూరక
కుండి యాకసమువంకఁ జూచి యేదో యోజించి యిట్లనియె.
"సుందరీ! అట్లయిన నేను ప్రాణము లియ్యవలసినదేనా?
దీని కుపాయాంతరము లేదా? మాయోపాయములచేత
నైన నీవునన్ను గెలిపింతువేని నీఋణము వేయిజన్మములకైనఁ
దీర్పఁజాలను. నీకాజన్మాంతము దాసానుదాసుఁడనై పడియుండెద.
అంతఃపుర పరిచారికలు కపటోపాయముల యందు మిక్కిలి
నేర్పరులని వినుచుందుము. అందునీవు సార్థక నామధేయవగు
కళావతివిగదా! కావున నేదోయొక పన్నుఁగడపన్ని యీవిప
త్సముద్రమునుండితప్పించి నన్నొకదరిఁ జేర్పుము."అన నయ్యింతి
గొంతతడవు చింతించి "యేదో యుపాయము రేపుదయమునఁ
జెప్పెద. నన్నిప్పుడు విడువు" మని వానికడ సెలవుఁగైకొని
పోయెను. పోయి మరునాఁడుదయమున వచ్చి యాతనియెదుట
నిలిచినతోడనె చంద్రకేతుఁ డామెనుజూచి యామెమనస్సు కల్ప
నాగర్భితమై యున్నదని గ్రహించి గారవించి కూర్చుండఁబనిచి
యుపాయముఁ జెప్పుమని వేడికొనియెను. అప్పుడు కళావతి
యిట్లనియె. "రాజా! రాతిరి నిదురలేక కడుదవ్వాలోచనముసేయ
నాబుద్ధికొకయుపాయము పొడఁగట్టినది. ఆయుపాయముఁ బ్రయో
గించి చూచెదను. అది నెఱవేరెనా నీవు ధన్యుఁడవు. అది యేమ
నిన నిది. "నేను మగల విదర్భరాజు నంతఃపురమునకు బోయి

వారని వేడుకొని కొలువులోఁజేరెదను. చేరినాలుగు దినము లున్న ట్లయుండి మణిమంజరికి మిక్కిలిఁ బ్రియములగు వస్తువు లను దొంగిలించు కొనివచ్చి నీకిచ్చెద. బంగారుపిడి గలిగి రత్న ములుఁజెక్కిన మొలకత్తి యొకటి. మకరందుని పేరుచెక్కిన ముద్దు టుంగర మొకటి. ఈరెండువస్తువులును మకరందుఁ డుజ్జయినికి వెళ్లునపుడు తనకు మారుగాఁ జూచుకొనవలసినదని దేవికిచ్చిపో యెను. వానినామె ప్రాణపదముగాఁ జూచుకొనుచున్నది. ఒక్క నిముసమైన యేమరియుండదు. ఆరెండువస్తువుల నెట్లో కష్టపడి తెచ్చి నేను నీకిచ్చెద. అవి నీవుఁ గైకొని విక్రమార్కుని సభ కరిగి యిట్లనుము. "మణిమంజరి నాచక్కఁదనముఁ జూచి నన్ను వలచి వరించి తనభర్త యిచ్చిన ప్రాణప్రియములగు రెండువస్తువు లను నాకిచ్చినది. ఆమెకంఠమునఁబుట్టుమచ్చయున్నది." అనియాన వాళ్లుచెప్పినీమాటనెగ్గించుకొనుము. అనివలుకగానెచంద్రకేతుఁడు బ్రహ్మానందభరితుఁడై కళావతినికౌఁగిలించుకొని దానికాళ్లకు నమ స్కరించి వేయివిధములఁబొగడి యావస్తువులఁ దెమ్మనిపంపెను.

---

## అయిదవ ప్రకరణము.

చంద్రకేతునివద్ద సెలవు పుచ్చుకొని కళావతి తనయిం టికిం జని యారేయి చాలసేపు తన మాట చెల్లించుకొనుట కెద్దియుపాయ మని తలపోయుచుఁ జొచ్చెను. కొంతతడవు తలపో యునప్పటికి దాని మనంబున కొక గట్టియుపాయము తోచె. తోచినతోడనే మనశ్శాంతిఁ గలిగి కొంతసేపు నిదురించి యుద

యంబున మేలుకాంచి యెప్పటియట్ల తన యాభరణములం ధరించుకొని విదర్భరాజు నంతఃపురంబునకుం జనియెను. దానిని దవ్వులం జూచి చెలిమికత్తెలు పరుగుపరుగునం బోయి "అమ్మా! కళావతి యెందుకో మరల వచ్చుచున్నది" యని మణిమంజరీదేవికి విన్నవించిరి. "రానిండు. ఏలవచ్చెనో తెలిసికొందమని దేవి యుత్తర మిచ్చెను. ఈసంభాషణ జరుగునప్పటికి కళావతి దేవి సన్నిధిఁజేరి పాదాభివందన మాచరించి చేతులు జోడించుకొని యెదుట నిలువఁబడెను. దేవి దానినిఁ జూచి "కళావతీ! కుశలమా. ఇన్నినాళ్ళెచ్చట నుంటివే. నీవువట్టి వెఱ్ఱిదానవు. పిచ్చికోపమె గాని నీమేలెఱుంగవు. నీకెంతతో చిన నంతే. అలుకవోడమిసప్పు డౌరులమాట నీవు వినవు. నీవు వెళ్ళినది మొదలుకొని యెక్కడనుంటివో నీకు సుఖముగ దినములు జరుగుచున్నవో లేవో యని నేను నిరంతరము విచారించుచుందును. మరల నీవు నాకంటఁబడినందున నాకిప్పుడు పరమసంతోషముగ నున్నది. నేను కాపురమునకు వచ్చిన తరువాత నిన్ను విడిచి యెన్నడు నుండలేదు. కావున నీవు లేక పోవుటచే నాయిల్లు నామనసుఁ గూడ చిన్నవోయి యున్నవి. అవి యిప్పుడు తిరిగి కలకల లాడుచున్నవి. నీవు వచ్చిన పని యేమో చెప్పుము. కూర్చుండు" మని సాదరపూర్వక భాషణంబుల పలకరించెను. దయార్ద్రగర్భితములైన యాపలుకుల కలరి కళావతి రాణితో మెల్లన నిట్లనియె. "అమ్మా! మీరు సెలవిచ్చినట్లు పిచ్చికోపమె గాని నాకు మఱియొకటి లేదు.

కన్నబిడ్డకంటె నెక్కువగ నన్ను మీరాదరించుచుండ నే
నది యొల్లక దురాగ్రహముచే మీమందిరంబు వెడలి వెళ్ళి
నందుకు నాయనుభవము నాకైనది. వెళ్ళినది మొదలు కడుపు
నిండ నన్నము గానను. కట్టుకొనుటకు శుభ్రమైన చీరయెఱుం
గను. చిన్ననాఁటఁగోలె రాజాంతఃపురమున నుండి దేవితో
పాటు సకలభోగంబుల కలవడుటంజేసి నేల పండుకొనలేక
నోటకూడు తినలేక యిన్నాళ్లు మిక్కిలి బాధపడితిని. స్థాన
భ్రష్టమెన్నఁడుఁ గూడదని పెద్దలు చెప్పినమాట యసత్యము
గాదు. ఇప్పుడా బాధలు పడలేక కృపారస స్వభావ యగు
దేవి చరణారవిందముల నాశ్రయించి వెనుకఁ జేసిన తప్పులకు
క్షమార్పణ జెప్పుకొనవలెనని యిక్కడకు వచ్చితిని. నాతప్పు
సైరించి నన్ను మరల మీకొలువునకుం దీసికొండు. బుద్ధి
మాలిన నాచెయిదములను క్షమియింపుడు. నాకభయప్రదానం
మిచ్చి రక్షించినట్లు మీరు సెలవిచ్చువఱకు మీపాదములను
విడువ" నని పాదములపైఁ బడెను.

దాని దీనోక్తులు వినగానే మనసు కరుగ లేవనెత్తి "నీ
వు నాయొద్ద నుండుటకు నాయాటంక మెన్నఁడును లేదు. నీవెప్ప
టివలె నాయొద్ద నుండవచ్చును. రాజముఖియు నీవు నక్కచె
ల్లెండ్రవలె మెలగుచుండుడు. రాజముఖీ! దీని వెనుకటి త
ప్పుల నీవు సైరింపవలె" నని దేవి పలికెను. కళావతి సంతోషిం
చెను. రాజముఖి యెందుచేతనో కళావతి రాకనుగూర్చి యంత
యుత్సాహపడలేదు. దేవి తనతోఁ బలికిన పలుకుల కామె యిట్లు

నియె. "అమ్మా నిగ్రహానుగ్రహసమర్థులగు మీయాజ్ఞ మేము శిరసావహించ దగిన వారము. కళావతి వచ్చినందువలన నాకు గలిగిన నష్టములేదు. దానితప్పులు సైరించుటకు నేనెంతదానను. అన్నిటికి మీరే యున్నారు. కళావతి యిక్కడ నుండుట మీకిష్ట మైన పక్షమున నాకు నిష్టమే" రాజముఖియొక్క ముఖవైఖరియు దానివచోధోరణియు గళావతి మనస్సునకు రంజకముగ నుండకపోయెను. అయినను కార్యవాదినియగుటచే నామె యేమి యుననలేక యూరకుండెను. అట్లుకొన్ని దినములు గడచెను. కడు నమ్మికతో కళావతి యెప్పటియట్లంతఃపురమందే సంచరింపఁ జొచ్చెను. దేవి తనతాళముచేతు లామెకిచ్చివేసెను. ఒక్కనాఁడు సాయంకాలము దేవి రాజముఖి మొదలగుపరిచారికలతోఁ గలసి తనయుద్యానవనమందున్న కాళికాదేవియాలయమునకు భవానీ దేవికి నమస్కరింపవలయుననిపోయెను. రమ్మని యామె కళావతి నిబిలిచెను. గాని తలనొప్పిగానున్నదను నెపమున నామె వెంట నరుఁగలేదు. తనభర్త చాలకాలమునుండి రాకపోవుటచే మనసులో బెంగగొని తనభర్త సురక్షితముగ నచిరకాలములో వచ్చునట్లనుగ్రహింపవలసినదని మణిమంజరీదేవి కాళికాదేవిని ప్రార్థించి ప్రార్థనానంతరమున గృహాభిముఖయై యాలయద్వారము విడుచు నప్పటికి పెద్దగాలిదుమారము బయలుదేఱి వారిపయన మాటంకపఱచెను. ఆదుమార మడుగగానె గొప్పవర్షము కురిసెను. అందుచేత వారిపయనము చాలసేపటివరకు నాగిపోయెను. వాన వెలియునప్పటికి నాలుగు గడియల రాత్రియయ్యెను. "రాజముఖీ!

కళావతి తలనొప్పిచే నెంతబాధపడుచున్నదో మనము వెళ్ళిమందు వేయుదము రావే" యని త్వరపెట్టి దేవి యామె నింటికి దీసికొని పోయెను. ఈలోపున గళావతి దేవియొక్క తాళముచేతులు తనయొద్దనుండుటచే నామె పెట్టెలన్నియుదీసి బంగారుపిడి మొలకత్తియు ముద్దుటుంగరమును సంగ్రహించి వాని నొకచోట దాచి యెప్పటియట్లందాళములుబిగించి దేవివచ్చునప్పటికి మిక్కిలి బాధపడుచున్నదానివలె మూల్గుచు పాన్పునం బొరలుచు దేవిని జూచి కన్నీరుపెట్టుకొనియిట్లనియె. "అమ్మా! నాకీబాధ దుస్సహముగానున్నది. ఎన్నడింతతలనొప్పి యెఱుంగను. ఎందుచేతనోగాని యిక్కడినీళ్లునాకుసరిపడుటలేదు. తలనొప్పిపలుమారు వచ్చుచున్నది. మీసెలవయ్యేనేని నేను రేపుదయముననె యిచ్చోటువిడచి యిక్కడకు దాపుననున్న గోగ్రామమునకుంబోయెదను. అక్కడ మామేనమామ లున్నారు. అక్కడ నెలదినములుండి మీపాదసన్నిధికివచ్చెద." అనవుడు దేవి "నీకు నీరుసరిపడనప్పుడు నిన్నుం డుమని బలవంతముసేయుట మంచిదికాదు. కావున నీవు వెళ్ళి మరల రావచ్చు" నని ప్రత్యుత్తర మిచ్చెను. అనంతర మందఱు భోజనముం జేసిరి. కళావతి బాధ యనునెపమున నన్నము ముట్టక నాలుగుగడియల తెల్లవారుజామునలేచి తాను దాంచిన వస్తువుల సంగ్రహించుకొని కోటం దాటి యవ్వలకుంబోయి సత్త్రమునం దున్న చంద్రకేతునిం గాంచియాతని కావస్తువులనిచ్చెను. ఆ రెండు వస్తువులం గ్రహించి చంద్రకేతుండు పెన్నిధి గన్న పేదచందంబున మహానందభరితుండై కళావతినిం జూచి "సుందరీ! నేను నీఋణము

వేయిజన్మంబులకైన దీర్ఘంజాల. నీవు నాకు మాటదక్కించితివి. నీవు ప్రసాదించినయీమాయాయుధంబులతో నాశత్రువును జయింపఁ గలను. నేనిప్పుడే యుజ్జయినీపురంబునకుఁ బోయి విక్రమార్క చక్రవర్తి సభామధ్యంబున విదర్భరాజుమాట యబద్ధమని చూపించి మరలవచ్చి నిన్ను నామందిరంబురంబునకుఁదోడ్కొని పోయి రాణులలో నొకర్తుగఁ జేసెద. అంతవఱకు నీవిక్కడనే యుండుము.” అని బహువిధంబుల దానినిలాలించి గారవించి మఱికొంత ద్రవ్యంబు నాభరణంబులు దానికి బహుమానమిచ్చి పంపి తాను పయనమై యుజ్జయినికిం బోయెను. విదర్భరాజీ మధ్య కాలంబునఁ దనమాటయె నిశ్చయంబుగ గెలుచుననియు లాట రాజు మాట యోటుపడు ననియు నమ్మియుండెను.



## ఆఱవ ప్రకరణము.

అటు లుండ లాటరాజు ఉజ్జయినికిం జని విక్రమార్కునిం గాంచి యాతనివద్దకు విదర్భరాజుం బిలిపించి మఱికొందఱు మధ్య వర్తులం గూడ రావించి యందఱి యెదుట నిట్లనియె. “విక్ర మార్కమహారాజా! నాఁడు మీసభామధ్యంబున నాకును విదర్భ రాజునకుఁ జరిగిన వాదములో లోకంబున మహాపతివ్రతలు గలరని వాదించుచు దనభార్యమహాపతివ్రత యని యతఁడు సాహసించి నొక్కి వక్కాణించె. ఆమె పాతివ్రత్యమునకు భంగము గలిగింతు నని నేను ప్రతినఁ దాల్చితిని. అట్లు చేయలేని యెడల నాశిరస్సునే నర్పించునట్లును నేను కృతకృత్యుండ నయితి నేని నాతని

శిరం బఖండించునట్లు గూడఁ బ్రతిజ్ఞలు చేసితిమిఁగదా. ఇదిగో విస్పాదు సమయము వచ్చినది. మోమోటము లేక జరిగిన యావద్వృత్తాంతము విన్నవించెద వినుండు. నేను విదర్భాపు రంబునకుం జని శృంగారరస ముట్టి పడునట్లు విలాసంబులు వెల్లివిరియునట్లు హొయలు గులుక రాజమందిరంబుముందటి నుండి గుఱ్ఱంబు నెక్కి స్వారి వెడలుచుండ నాచక్కఁదనముఁ జూచి విదర్భరాజపత్ని యగు మణిమంజరి మోహపరవశయై తన్నుఁ జేపట్టుమని తన దాసియగు కళావతిచే నాకు వర్తమానమంపెను. మీరు తెల్లబో వలదు. ఒండొరుల మొగములు చూచుకొనవద్దు. జరుగునని మీరెన్నఁడు తలంపని విశేషంబు లనేకంబులు లోకంబునఁజరుగుచుండును. ఆవర్తమానము విని నేను మిక్కిలి విస్మయముపడి యది నీతిగాదని పలుతెఱంగుల నామెకు బుద్ధులుచెప్పి పంపితిని. కాని యామాట లామె పెడచెవినిఁ బెట్టి నన్ను పలువిధంబుల బలవంత పెట్టుటచే నేనంతఃపురంబున కరిగి యామెతోఁ గలిసి యొక్క మాసము సకలసౌఖ్యంబుల ననుభవించితి" ఈపలుకులు వాని నోటనుండి వెడలగానె విక్రమార్కుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. విదర్భరాజు మేన ముచ్చెమటలుఁ బోసెను. తక్కినవారి మొగములు వెలవెలఁబాఱెను. ఒకరికి మనసు మనసులో లేక పోయెను. అది చూచి లాటరాజు సంతోషమొంది మరల తన వృత్తాంతము నిట్లుచెప్పెను. "అయ్యలారా! నిశ్చేష్టులైనను నిర్విణ్ణులయినను సత్యంబు వినక తప్పదు. ఆమెకునాయం దను

రాగము నిలిచినట్లు తార్కాణంబులు వలయునేని జూపెద. ఈవిదర్భరాజుజ్జయినికి బయలుదేఱి వచ్చునప్పుడు ప్రాణసమానమైన తనభార్యకు రెండువస్తువులను బహుమానంబుగ నిచ్చి వాటిం దనకుమారుగ జూచుకొమ్మని చెప్పెను. రతనాలు చెక్కిన బంగారుపిడిగల మొలకత్తి యొకటి, యీయన నామాక్షరములుం గల ముద్దుటుంగర మొకటి. ఈ రెంటి నామె ప్రాణపదంబుగం జూచుకొనుచు వచ్చెను. కాని నాయందలి గాఢానురాగంబుచే నాకా యమూల్యవస్తువుల నిచ్చె. ఆవస్తువులివిగో" అని చూపి యారెంటిని విక్రమార్కునియెదుటం బెట్టెను. అవిం జూచి యెల్లవారు విస్మయము పడిరి. విదర్భరాజగుమకరందుండు తనకన్నుల దాని నమ్మలేక యిది స్వప్నమా? నిజవృత్తాంతమా మాయయా" యని యించుకసేపు సందేహించి యెట్టకేలకు మనసు దిట్టముం జేసికొని యది నిజమె యని నమ్మెను. విక్రమార్కుండా రెండువస్తువులం జేతపట్టుకొని మకరందుని జూచి "రాజా! ఇవి నీవు నీభార్యకు బహుమానంబుగ నిచ్చిన వస్తువులా" యని యడిగెను. "అవును. ఇవి నేనిచ్చిన బహుమానములే" యని యాతండు ప్రత్యుత్తరము చెప్పెను. అంతటలాటరాజు చెప్పిన వృత్తాంతమంతయు నిశ్చయ మని సభాసదు లభిప్రాయపడిరి. అది కనిపెట్టి చంద్రకేతుండు విక్రమార్కున కిట్లనియె. "దేవా! ఓడిపోయినవారు శిరస్సునిచ్చుట మొదట నిర్ణయముగదా. ఆనిర్ణయముజరుపవలయు. మకరందునకును మీకునుజాలస్నేహము

గలదు. ధర్మనిర్ణయము వచ్చినప్పుడు స్నేహము( జూచుకొన( గూడదు. కాబట్టి విదర్భరాజు శిరచ్ఛేదము( జేయు(ప వలయు."

అనగానె విక్రమార్కునిమనసు జల్లుమనియెను. సభాసదులలో( గొందఱు చిన్నవోయి పేదచూపులంజూడ(జొచ్చిరి. కొంతతడవు విచారగ్రస్తు(డై యుండి విక్రమార్కు(డు లాటరాజుతో నిట్లనియె. "చంద్రకేతు(డా! దుష్యంత భరత యుధిష్ఠిర ప్రముఖులకు జన్మస్థానమైన చంద్రవంశమున జన్మించితివి. దయామయు(డని పేరు(గాంచిన భానుకేతునికడుపునం బొడమితివి. సకలవిద్యల నేర్చికొంటివి. నీవెఱుంగని ధర్మంబులుండవు. మాట పట్టింపులలో నీత(డోడిపోయినా(డన్నంతమాత్రమున వానిని( జంప(జూచుట న్యాయముకాదు. మొదటనిర్ణయ మట్టిదేయనుటకు సందియములేదు. నిర్ణయప్రకారము జరుపుమనికోరుట యమానుషము. ఇదిరాక్షసకృత్యము. నీవంటివానినోట రావలసినమాట గాదు. దయారసమువంటిది మఱియొకటిలేదు. అహింసకంటె యుత్తమధర్మములేదు. చెట్టునుండి కాయలుగాని పండ్లుగాని కోయుట మహాపాతకమనిభావించి తమయంతట క్రింద రాలినపండ్లనే భక్షించునట్టియు, దారినడచునప్పుడు కాలిక్రింద చీమలు మొదలగునల్పజంతువులు పడిచచ్చుననుభయమున నన్నిటిని(ద్రోలగించికాని నడువనట్టియు దయామయులగు మహర్షులగోత్రంబులం బ్రభవించి వారున్నదేశంబుల వసియించి వారురచియించిన శాస్త్రంబులం జదివియున్న నీవంటియుత్తమకులీను(డు నీవంటియుదారు(డు నీవంటిలోకజ్ఞు(డుమకరందునివంటిసజ్జనుని సాధుశీలుని నిష్ప

ళంకచరిత్రుని నిధనమొందింపఁదలఁచుట నిష్ఠురణము నింద్యమునీ చము. కావున నీకార్యంబునుండి తొలఁగుము. ఈకార్యము లోక సమ్మతమగును. అనవుడు సభాసదులయుల్లములెల్లఁ గరగెనుకాని పులిహృదయంబునుఁబోలిన చంద్రకేతుని హృదయముమాత్రము కరుగఁలేదు అతడు విక్రమార్కునకిట్లనియె. "దేవా! ఈపంతమున మీనెచ్చెలియగు మకరందుఁడోడిపోయెను. కావున మీరలీధర్మం బుల నుపన్యసింపనారంభించితిరి. నేనే యోడిపోయినపక్షమున నాతలఁదీయుటకు మీరందరు సిద్ధమైయుందురు. మీమాటయ టుండనిండు. నేనోడితినేని యీతడునాపైఁజాలివహించునా? కఠిన ముగానున్నను నిర్ణయముప్రకారము జరిగితీరవలయు. జరుపరేని మీపక్షపాతమే లోకమున వెల్లడియగుఁగాక! అని యాతడు మా టలుముగింపకమునుపె మకరందుడడ్డమువచ్చి యిట్లనియె. 'విక్ర మార్క భూపాల! ఆతని పంతము నెఱవేరినది. నే నిప్పుడు శిరసు నియ్యవలసినవాడను. కావున మీరట్లు చేయుటకు సెల వియ్యవలయును. మాట తప్పుట మనకు పాడిగాదు. అటువంటి మహాపతివ్రతయగునిల్లాలు నన్ను మోసముచేసిన తరు వాత నీతుచ్ఛప్రాణముతో హేయమైనయీశరీరముతో నా కీ లోకంబున నుండుట కిష్టము లేదు. మరణ మెంతశీఘ్రము గ లభించిన నంత యదృష్టమని నేను తలంచుచున్నాఁడ. కాని నాకొక కోరిక గలదు. చిన్ననాటనుండి కాశికానగరంబు నకుఁ బోవలయు ననియు పోయి జాహ్నవీస్నానముఁ జేసి విశ్వే శ్వరస్వామిని దర్శింపవలయుననియు నభిలాషఁ గలదు.

నామనోరథము దీర్చికొనకుండ మృతినొందుట కిష్టము లేదు. కావున పోవుట కనుజ్ఞనిండు. మాసము దినములలో మరల నిక్కడకు వచ్చి యుండెద. "అనవుడు విక్రమార్కుఁడు సమ్మతించె. లాటరాజు దాని కిష్టపడక "యిది మోసముచేసి పాఱి పోవుట కొఱకయెత్తు. కావున వెళ్ళనీయగూడ" దని యాటంకము జెప్పెను. అప్పుడు సింధురాజు కటకటంబడి లేచి యిట్లనియె. "బలవంతముగ నాతని ప్రాణముం దీయుటయెగాక చరమావస్థలో భగవత్సేవనైన జేసికొననీయవా? పుణ్యగతులకుంగూడ బోనీయవా? ఆతడు రాకున్న నాతని బదులునేను నాశిరస్సు నిచ్చెద. ఆతని బోనిమ్ము. ఆతఁడు రానివాడుకాడు" అని సభాసదులు మెచ్చునట్లు పలికెను. అందఱు సంతోషించిరి. లాటరాజు విధిలేక యొప్పుకొనెను. మకరందుఁడు కొంత పరివారముఁ దీసికొని కాసినానగరమునకుం జనియెను.

## ఏడవ ప్రకరణము.

విదర్భరాజు లాటరాజుతో దుర్బలవాదము చేసి యోటుపడి ప్రాణము గోల్పోవుచున్నాఁడని లోకులు చెప్పుకొనసాగిరి. ఆవార్త విదర్భ దేశమునంగూడ పడెను. పల్లెలయందు పట్టణములయందు నెవ్వరినోటజూచిన నిదియేమాట. మకరందుఁడు ధర్మప్రభువగుటంజేసి జనులావార్త విని తమతమ యాప్తబంధువుల కాయాపద వచ్చినట్లె విషాదము నందిరి; రాజధానియగు విదర్భాపురమునఁగూడ ప్రతిగృహమం దీవిషయము

చర్చింపఁబడఁజొచ్చెను. దేవి పాతివ్రత్యమునుగూర్చి పందె
మువేసి రాజు పరాజయము నొందుటచే బట్టణవాసులు బహి
రంగముగ నీవిషయముఁ జెప్పుకొనుట కిష్టములేక తమలో
దాము గుజగుజలువోవఁ జొచ్చిరి. క్రమక్రమముగనిది ముఖ్య
మంత్రియగు భానుమంతునకుఁ దెలిసెను. తెలిసినతోడనె
యతఁడు తనచారులఁబిలిచి యుజ్జయినికిఁబోయి యథార్థస్థితిదెలి
సికొని రమ్మని చెప్పిపంపెను. దేవిస్వవిషయ మగుటచే నీవార్త
యామెకుం దెలియఁజేయ తగునా తగదా యని భానుమంతుఁడు
ముఖ్యగుమంత్రులు విచారింపఁజొచ్చిరి. చెప్పఁదగునని కొం
దఱు, చెప్పఁగూడదని కొందఱు, వాదించిరి. మణిమంజరి
నిష్కళంకచరిత్రి యని కొందఱుఁబలికిరి. నిష్కళంకచరిత్రియైన
పక్షమున భర్త సమరణ మేలసంభవించు? ఏపుట్టలో నే పా
మున్నదో మనకేమి తెలియు నని కొందఱనిరి. భర్తృవృత్తాంతము
భార్యకు దెలియఁజేయకపోవుట యధర్మమని భానుమంతుఁడు నిశ్చ
యించుకొని దేవికిఁజెలిమికత్తెయగురాజముఖి కావృత్తాంతమెఱిఁ
గించెను. రాజముఖి యావార్తవినియదరిపడి యంతఃపురమునకుం
జని విచారగ్రస్తయై యొకచోటఁగూర్చుండెను. నిరంతరమందహా
సముతో గలకలలాడుదానిమొగము విన్నవోవుటఁజూచి దేవి
దానినిఁ దగ్గరివిచారకారణమడిగెను. అదిదుఃఖముచేత కొంతసేపు
మాటాడనోపకయెట్టకేలకు గద్గదస్వరముతో నిట్లనియె. "ఈవి
చారము నావిషయమైనదికాదు. చెప్పుటకునోరాడకున్నది. ఇది
నీవిషయమైనదుఃఖము. నీభర్తగారివిషయమైనదుఃఖము. అగ్నికి

చెదలువట్టినవఁట. బంగారమునకుఁదుప్పువట్టినదఁట. మల్లెపువ్వున కుదుర్వాసనపుట్టినదఁట. కలియుగసీత కలియుగచంద్రమతి కలియుగదమయంతి కలియుగారుంధతి యనిచెప్పఁదగిన మనోమంజరీదేవిశుద్ధచరిత్రమునకు మాలిన్యమంటినదఁట. నీమగడును లాటరాజును లోకమున బతివ్రతలుగలరాయని వాదించుకొనిరట. లోకమునఁబతివ్రతలులేరని లాటరాజనెనఁట. ఉన్నారు. నాభార్యయే పతివ్రతయని నీమగఁడనియెనఁట. అట్లయిన నీభార్యపాతివ్రత్యము భంగపరచెదనని లాటరాజు ప్రతినగైకొనెనఁట ఓడిపోయినవారి శిరచ్ఛేదమగునట్లు నీమను చేసికొనిరఁట. అనంతరము కొంతకాలమునకు లాటరాజు నీతోనెయ్యముఁజేసెనఁట. నీవాతనిమోహించితివఁట. మోహావేశంబున నోడలెఱుంగక సిగ్గువిడిచి నీమగఁడు నీకుప్రేమాతిశయంబుననిచ్చిన మొలకత్తియు ముద్దుటుంగరమును వానికిచ్చితివఁట. లాటరాజువానిఁగైకొని విక్రమార్కునిసభకుఁబోయి నీశీలముభంగపుచ్చినందు కానవాలుగఁజూపి తనమాట నెగ్గించుకొనియెనఁట. నీభర్తగారు విక్రమార్కుఁడు తక్కినసభాసదులు దానిని నమ్మిరఁట. నేఁడో రేపో నీభర్తకు శిరచ్ఛేదమగునఁట. ప్రధానియగు భానుమంతుఁడు చెప్పలేకచెప్పలేక యీదుర్వార్త నాచెవిలోవేసెను. నీమానరక్షణమును భర్తప్రాణరక్షణమును జేసికొనుటకు నేదైనయుపాయముండునేమోయని నేనిదినీకు విన్నవించితిని.” ఈపలుకులు సూదులుగ్రుచ్చినట్లు దేవిచెవికధికబాధకలిగించెను. నిశ్చేష్టయై నిలువబడలేక కూర్చుండలేక పాన్పుపైఁబడెను. రెండుకన్నులనుండి వేడినీళ్లు కాలువలై కారఁజొచ్చెను.

నడుమనడుమ రాజముఖింజూచి యేదోపలుకుచు వెక్కి వెక్కి యేం డంజొచ్చెను. రాజముఖి దేవింజూచి బహువిధముల నూఱార్చి ప్రతి క్రియ సేయవలయుంగాని దుఃఖపడినం గార్యములేదనిపలికెను. ప్రథ మదుఃఖముపశమిల్లినతరువాతకొంత తెప్పిరిల్లి దేవిచెలితోనిట్లనియె. "రాజముఖీ! లోకమున నెంతమాటపుట్టినదే. ఎందుకే యీ పాడు ప్రాణములు. నిష్కళంకమగు కాశ్మీరరాజకుటుంబమునకు నాజన్మమువలన కళంకముం దెచ్చితిని. పరిశుద్ధమైన విదర్భ రాజకుటుంబమునకు మాలిన్యము గలిగించితిని. కలియుగ హరి శ్చంద్రుం డనిపేరుగాంచిన భర్తగారి కకాలమృత్యువుం దెచ్చితిని. పుట్టినయింటికి నత్తవారియింటికి మచ్చదెచ్చిననావంటి దురా త్మురాలు బంధువులకుభారము. భూమికిభారము. తేవే. వజ్రమునూరి తేవే. ఆపొడిమ్రింగి క్షణములో నీపాడుదేహము నగ్నిలోవైచి పరిశుద్ధముంజేసెదను. ఎవడే లాటరాజు. అదురా త్ముని శౌర్యమవినలేదే? యమదూతలవలె సింగములవలె నిచ్చ కత్తులతో గోడచుట్టు గావలియున్న రక్షకభటుల కంటబడ కుండ నాగుండెకాయ యగు నీకుందెలియకుండ లాట రాజు నాయంతఃపురముం జొచ్చెనా? నేను వానిని మోహిం చితినా? దురాత్మా! లాటరాజా! పతి పాదారవింద ములే శరణంబులని పరపురుష సందర్శనమైన జేయక కాల క్షేపముం జేయుచున్న పతివ్రతకుం జిత్తక్షోభము గలిగించినందుకు నాయుసురునీకుం దగులకపోదు. ఇంతకంటె ఘాతలేదు. ఇంత కంటె దౌర్జన్యములేదు. ఇది యమానుషకృత్యము. రాక్షసకృ

త్యము. ఈతనిపాపమునకు మేర లేదు. ఈయసత్యకల్పనముచేత లాటరాజు నరకలోకమునకు మెట్లుకట్టుకొనియెను. చెలీ ! యీ వార్త లోకమెట్లునమ్మునదే? ఇరువది సంవత్సరములనుండిభర్త తోఁ గాపురము జేసినదానను. చిన్నదాననుగాను. సంతాన వంతురాలను. ఓలోకమా ! నీకు నమ్మతగినదియు నమ్మతగ నిదియు ననుమాట లేదుకదా. సఖీ ! భర్తగారెట్లునమ్మిరే? తనపై నాకుగల భక్తి యెఱుంగరా ? నాశీలమెఱుంగరా ? చిర కాలస్నేహమువలన నాస్వభావము గ్రహింపలేకపోయిరా ? ఆప దలు సమీపించినపుడు బుద్ధిమంతులకైన మనసులు చెడిపో వును. మొలకత్తెయు ముద్దుటుంగరమును జూపినమాత్రమున నాయనకు నమ్మకముదోచెగాఁ బోలు. ఈవస్తువులు వానికె ట్లులభించినవే?" అనుచుండ రాజముఖి నామెమాట కడ్డము వోయి యిట్లనియె. "అమ్మా ! ఎట్లులభించె ననవేల ? కళా వతియె తప్పక యిచ్చినది. కపటబాధపడి తనకీయూరినీళ్ళు పడ లేదనిబొంకి తెల్లవారుజామున లేచిపోయినప్పుడె యీవస్తు వులను దీసికొని పోయియుండును. మనము కాళికాలయమునకు బోయినప్పుడది యింటనుండుటకుఁ గారణ మిదె. మనలను మోసముచేయుటకె యిది మరల వచ్చెను. దానిని మరలఁ జేర్చి కొనుట నాకిష్టములేదు. అయినను నామాట నెగ్గదయ్యె. మీకిష్టమయినదో దాయని నేనంత విస్పష్టముగా దానిని జేర్చి కొనవలదని చెప్పఁజాలనైతిని. కడచినదానికి విచారించుటయెం దుకు? కర్తవ్యమూహించవలయును." అనవుడు దేవి యించుక

యోజించి, "సఖీ! దగ్గఱరమ్మా, నేనీవిధముగాఁ జేయఁదలచుకొన్నా" నని చెవిలో నేదియో చెప్పెను. "ఈప్రయోగము చక్కఁగానున్న" దని రాజముఖి బదులుచెప్పెను. "అట్లయిన మంత్రివద్దకు నీవరిగి నేనీదినముననే యిక్కడనుండి దేశాంతరమున కరిగెదనని చెప్పి పదుగురు భటులను నాకు సాయమిమ్మను" మని దేవిచెప్పెను. అనవుడు రాజముఖి సరేయని మంత్రికడకుఁజని యాతనికిష్టములేకున్న నెట్లో యొడంబరిచి దేవియు రాజముఖియు నర్ధరాత్రమున పదుగురుబంట్ల వెంటబెట్టుకొని దేశాంతరమున కరిగిరి.

---

## ఎనిమిదవప్రకరణము.

కాశీయాత్రకువెళ్ళిన మకరందుఁడు నియమితకాలమునకు రాలేకపోయెను. మకరందుఁడు సహజముగాఁ బరమభక్తుఁడగుటచేతను బ్రిస్తుతయాత్ర చెరమదశలో జేయునదగుటచేతను వానిహృదయమున భక్తి యినుమడించెను. అందువలన గంగాస్నానముఁ జేయునప్పుడును విశ్వేశ్వరసందర్శనముఁ జేయునప్పుడును భైరవబిందుమాధవమణికర్ణికాన్నపూర్ణాది మూర్తులను సేవించినప్పుడును నతడు మేనుమరచి యానందసముద్రమున నోలలాడెను. ఎన్నిదినములు వారణాసియందున్నను మకరందునకు సంతుష్టికలుగదయ్యె. దేహయాత్ర నడుపువానికిం బ్రతికినకొలంది బ్రతుక నిచ్చపుట్టునట్లు తీర్థయాత్రసేయునితనికిఁ గాశీలోనున్నకొలంది నుండ బుద్ధియయ్యెను. అచటి దేహా

లయములు దినదినము వానికిఁ గ్రొత్త క్రొత్త రూపములు ధరించి కానఁబడఁజొచ్చెను. ఈకారణంబులంబట్టి నియమిత కాలము నకతఁడు రానందున లాటరాజు తనశత్రువు కాశీయాత్రయను వంకఁబెట్టి దండన తప్పించుకొని పారిపోయెనని యెంచి విక్రమార్కున కిట్లనియె. "రాజేంద్రా! మకరందుఁడు సత్య హరిశ్చంద్రుఁడని మీకందరకు నమ్మికగదా! ఏమిచేసెనో చూడుఁడు. కాశీయాత్రయని వంకబెట్టి తలకొట్లు తప్పించుకొని దేశాంతరములపాలై పోయెను. ఇక వానినెవ్వఁడు పట్టుకొనఁ గలఁడు. ఇక నతఁడు మనచేతఁజిక్కునా? ఇదియా సత్యము? ఇదియా ధర్మప్రవర్తనము. కుటిలోపాయంబులం బన్ని దండనము తప్పించుకొన్నవారు సత్యహరిశ్చంద్రులు కాబోలు. న్యాయమునకు నిలువఁబడి యేవిపత్తులకయిన నోడిగట్టి యే యాపదలకైన తలయొగ్గియున్న మాబోంట్లు ధర్మనిరతులు కారు. ఆతని రాకకు నాఁడు పూటబడిన సింధురాజు కుట్రజేసి వానిని రాకుండఁజేసియుండును. ఇప్పుడు నాకు ధర్మముకావలెను. ఆతడు రానిపక్షమున సింధురాజు తలనిచ్చెదనని నాఁడు మీ యెదుట కోతఁలు కోసెనుగద. కావున నిప్పుడాతని శిరస్సు మకరందుని శిరస్సునకు బదులుగా ధర్మదేవతకు బలియిండు. ఇట్లనుచున్నానని నన్ను క్రూరునిగా మీరు భావింపవలదు. అనుకొన్నట్లు చేయుటధర్మము. నిర్ణయించుకొన్నట్లు చేయక పోవుట యధర్మము. ఇచ్చెదనని యీయకపోవుట వచ్చెదనని

రాకపోవుట చేసెదనన్న కార్యము-చేయకపోవుట పరమదుష్కార్యము. కావున ధర్మముఁ దయచేయవలయు."

అనవుడు విక్రమార్కుఁడతని కిట్లనియె. లాటరాజా! బ్రహ్మదేవుఁడు సృష్టించునప్పుడు నీశరీరమున బెద్దపులి గుండె కాయఁ బెట్టి నీనోటిలో నరునినాలుకఁ బెట్టినాఁడు. ఇట్టిపొరబాటులు తరచుగాఁగలుగుచుండును. లేనిచో నీవింతమనుష్యరక్త వాంఛఁ దగిలియుండవు. పులికి నీకు నొక్కభేద మున్నది. అది మానవ రక్తము త్రాగును. దాని యాకలికొరకది మనుష్యునిఁ జంపును! గావున నదికొంతవఱకుధర్మమే, నీవుమనుష్యుని చంపదలఁతువుగాని భక్షింపవు' చంపుటయే నీకు వినోదము. అదియే నీకనులపండువు. కానిచో లోకాభిరామాయణము వచ్చిన పంతమునకై మహిత గుణశాలి యగుమకరందుని జంపఁజూతువా? అతఁడువచ్చుట యాలస్యమయినదని వానికిబదులుగా సింధురాజునుఁ జంప జూతువా? పైగాసిగ్గుమాలి ధర్మము ధర్మమని వాగుచుందువేల? నిరపరాధుల వధియించుటాధర్మము? మానవరక్తస్యందమా ధర్మము? క్రూరత్వమా ధర్మము? సూర్యచంద్రులు గతులు దప్పినను మకరందుఁ డనృతమాడువాఁడుకాఁడు. ఏదోకారణ ముండ బట్టియాతఁడాలస్యముఁ జేసియుండును. నీకునీచపుందలఁపు లుండుటచేత మకరందుఁడుగూడ నీచుఁడని యాలోచించుచున్నావు. అతఁడు నీచుఁడుకాఁడు. అతఁడు పరమధర్మ స్వరూపుఁడు." అతనిమాటలువిని లాటరాజు సిగ్గుపడి యూరకుండెను. అంతలో సింధురాజు వచ్చెను. అంతకు ముందతఁడు ప్రక్కగదిలో

గూర్చుండి వారిద్దరిసంభాషణ మాలకించెను. మకరందుని యందు సింధురాజునకతిభక్తి. ఆతనివద్ద నీతఁడు చిన్ననాఁడు ధనుర్విద్య నేర్చికొనియెను. ధనుర్విద్యయందేగాక వయసునందు విద్యయందు సత్ప్రవర్తనమునందు మకరందుఁడు తనకు గురువగుటఁజేసి సింధురాజతనిని దైవముగ నెంచును. విక్రమార్కుఁడు లాటరాజు సమ్మతించినపక్షమున మకరందునకు బదులు తానుమరణ మొందవలయునని మొదటినుండియు నాతఁడు సంకల్పించు కొనియెను. కాని నోరుఁదెఱచి తనయభిప్రాయము వెలిపుచ్చిననతనిమాట యెాటువోవునేమో యను భయమున నంతవఱ కూరకుండెను. ఆతఁడు రాగానే విక్రమార్కుఁడు సబహుమానముగ గూర్చుండుమనియెను. కూర్చుండి సింధురాజు విక్రమార్కుని నెమ్మొగంబునఁ జూడ్కి నిలిపి మెల్లన నిట్లనియె. "దేవా? నాదొక్కమనవి యవధరింపవలయు. మకరందుఁడు నియమితకాలమునకు రాలేదు. మార్గంబుననతని కేమైన నాపద వచ్చియుండు. ఆతనికిఁ బదులుగ నేను నాప్రాణంబుల నర్పించెద. దీనికి దేవర యియ్యకొనవలయు. కలుషభూయిష్ఠమైన నాశరీరమును ధన్యముజేసికొనుటకు నాకింతకంటె వేరుమార్గములేదు. ఎంతకాలము జీవించినను మృతినొందక తప్పదుగదా? మనోవేదనలచేతను శరీర ఋగ్మతలచేతను మితిలేనివ్యథపొంది బహుపాపసంచయములచే నపవిత్రమై యెందుకుంగొరగాకయున్న యీపాడుశరీరము గుణరత్నాకరుఁడు యాచకమందారుండు నగు మకరందునికొఱకై యర్పించుటకంటె

ప్రశస్త కార్యములేదు. కావున నామృతికి సెలవియ్యవలయు." అని యాచించుటయు విక్రమార్కుఁడాతనిసాహసమునకు నౌదార్యమునకు లోకోపకారపరాయణతకు నక్కజమంది యాతనిమీఁదఁ జేయినైచి తట్టి "ఆయుష్మంతుఁడా? అలోక సామాన్యమగు నీయౌదార్యమునకు సంతసించితి. నీవంటిపరోపకారుల లోకమున మరి పదుగురున్న పక్షమున లోకమీవిధముగానుండదు. వీరపత్నులగు భారతఖండస్త్రీలు మకరందునివంటిబిడ్డలను నీవంటిబిడ్డలను నూఱులకొలఁదిగా వేలకొలఁదిగా లక్షకొలఁదిగా గని నేలనంతయు బరోపకారులచే నింపుదురుగాక. నీవుమృతినొందినపక్షమున నీ కీర్తిదేహము లోకమున శాశ్వతమై నిలిచియుండునుగావున నీవుబ్రతికియేయుందువు. మకరందుఁడు మాటప్రకారము రాజాల నందునను నీమరణంబునకుఁ గారణమవుటచేతను బ్రతికియుండియు మృతయశస్కుఁడగుటచేతఁ జచ్చినవారిలోఁ బరిగణింపఁబడును. కావున నీసంకల్పమున సంవరింపు" మని హితోపదేశముఁ జేసెను. అందుకాతఁడొకవిధముగా సమ్మతించెను. లాటరాజు తన మనోరథసిద్ధి దూరమగుచున్నందుకు విచారించి యేమియుననఁజాలక యూరకుండెను.



## తొమ్మిదవ ప్రకరణము.

పిమ్మట నాలుగుదినములకు మకరందమహారాజు కాశీకానగరమునుండి యుజ్జయినికివచ్చి తనరాక విక్రమార్కునకెఱిఁగించెను. విక్రమార్కుఁడాతని తనసన్నిధికిరావించి గౌరవించి యత్యా

దరముతో నిట్లనియె. "మిత్రమా! నీవు వచ్చుటకింత యాలస్య మేలయైనది. లాటరాజు నీపై యపవాదములనేన్నోపన్ని నీకీర్తిఁ గలుషముఁ జేయఁదలఁచుచున్నాఁడు. నీరాకకు సింధురాజు పూట బడియుండుటచే లాటరాజాతని తలఁ దెగనేయఁగోరుచున్నాఁడు. సింధురాజుగొప్పయౌదార్యముతో నీప్రాణములరక్షించుటకు తన ప్రాణముల నీయదలఁచుకొన్నాఁడు. నీవు దేశాంతరములకో వనాంతరములకో పారిపోయి తలదాఁచుకొన్నావనియు మరలరావనియు లాటరాజుతననాలుకయాడ్చినట్లెల్లఁగున ప్రేలుచున్నాఁడు. నేను కుట్రపన్ని నిన్నిక్కడనుండి పంపివేసితినని వానియభిప్రాయము. కానిమ్ము. అంతయు మంచిదయ్యె. నీవు వచ్చితివి." అన వుడు మకరందుఁడు మందహాసముఁ జేసి యిట్లనియె. "లాట రాజు భ్రమపడియున్నాఁడు. నాకంఠముఁగాపాడుకొనుటకై నేనీ జన్మమున మాటతప్పువాడను కాను. పరిచయము లేకపోవు టచే లాటరాజు నాచరిత్ర మెఱుఁగడు. కాశికానగరము విడు వలేక నేనాలశ్యముఁజేసితిని. అంతకంటె వేఱుకారణములేదు. తాపత్రయంబును హరియించునట్టి భాగీరథీజలంబుల చల్లని తరంగముల సందర్శనసుఖము విడుచుట యెట్టివారికి దుస్సా ధ్యము గదా. స్వల్పకాల మాలస్యమైనది. అందుకు మీరు నన్ను క్షమియింతురుగాక ! ఇఁక మీఁద నేనును లాటరాజును వేసికొన్న పందెముప్రకారము పరాజయము నొందినవాడ నగుటచేత నాశిరచ్ఛేదముఁ జేయుటకు మీరొకదినమేర్పరుపుడు నాకవశిష్టంబు లెవ్వియు లేవు. మనోరథసిద్ధియైనది. నే నెవరిం

జూడనక్కఱలేదు. అవసానకాలంబున దేనిని ధ్యానించిన పక్ష
మున నక్షయసుఖములు చేకూరునో యట్టి యీశ్వరపాదా
రవిందయుగళంబు నామనంబున నిల్పియున్నవాఁడ. భవరోగ
ములకెల్ల దివ్యౌషధంబైన యీశ్వరభక్తిని సంగ్రహించి యుం
చినాఁడ. నేనిప్పుడు నిశ్చలముగ నిర్విచారముగ నిర్భయముగ
మృతినొందఁగలను. లాటరాజునకనుమానకరమై నాకసహ్యమై
యున్న యీతనువును సత్వరముగ నీశ్వరసాన్నిధ్యముఁ జేర్చి
నాకు మహోపకారము సేయవలయునని కోరుచున్నాను.” అ
ప్పలుకులు విని విక్రమార్కుఁడు గాఢసంతాపంబున గొంతసే
పు మాటలాడఁజాలక యెట్టకేలకిట్లనియె. “మిత్రుఁడా! యీ
వాదము నాసభామంటపమున వచ్చినందుకు నాచేతులార నేనీ
దుష్కార్యముఁ జేయింపవలసివచ్చినందుకునామనంబు మిక్కిలి
దుఃఖించుచున్నది. ఈవాదంబున నీవు పరాజయము నొందినది
మొదలుకొని నిన్ను రక్షించుట కేదేనియుపాయంబు గలదా
యని తలపోయుచుంటిని. కాని నాబుద్ధి కింతవఱకొక్కయు
పాయమైన గోచరింపలేదు.” అనుచుండ నతని మాటకడ్డము
వచ్చి మకరందుఁ డిట్లనియె. “దేవా! యొకమిత్రుని తుచ్ఛ
ప్రాణము రక్షించుటకై మీరెన్నివిధముల పాటుపడ నక్కఱ
లేదు. ప్రతిన నెఱవేర్చుట మానవులకెల్ల సముచితము. ప్రతి
జ్ఞాపరిపాలన మనగా సత్యవ్రతాచరణము. జగము సత్యము
నాశ్రయించియున్నది. రాజుల సింహాసనములు సత్యము నాధా
రము జేసికొనియున్నవి. సత్యపరిపాలనము జేయని మను

జూఁడు రాజైనను గౌరవార్హుఁడు గాఁడు. సత్యవాక్యపరిపాలకుఁడే రాజ్యము లేకున్నను మనుష్యులలోనెల్ల రాజగుచున్నాఁడు. సత్యమే వాని కిరీటము. సత్యమే వాని సింహాసనము. సత్య పరిపాలనము సేయని రాజు రాజ్యమున కనర్హుఁడు. అందుచేత మనము సర్వవిధములచేత సత్యమును పరిపాలింపవలయును. కావున నామాట విని నానిమిత్తమై విచారము నొందక శిరచ్ఛేదమున కాజ్ఞయొసంగుఁడు. నానిమిత్తమై మీరు ఖేదపడుటకు నాయందు మీకుఁగల ప్రేమమే కారణము. ఈదృఢస్నేహపాశమును మీరు తెంపవలయు. మనుష్యులకెల్ల మరణము నిశ్చయము. మరణమనగా నీప్రపంచమునుండి పరలోకమునకు మనల దీసికొనిపోవురథము. ఈరథంబును పుణ్యంబులనుగుఱ్ఱంబులును పాపంబులనుగుఱ్ఱంబులు లాగును. పుణ్యంబులనుగుఱ్ఱంబుల బూన్చిన రథంబును మహాత్ములెక్కి పరమేశ్వరసాన్నిధ్యమునకుఁ బోవుదురు. పాపహయంబులఁగట్టినయరదంబులెక్కి దుష్టాత్ములు దుర్గతులకుంబోవుదురు. కాని యేదో రథమెక్కక యెవరికిం దప్పదు. విశ్వమందుగల సమస్తజంతువులకు మరణమున్నది. కడజాతివాఁడు మృతినొందినట్లె మహారాజును మృతినొందును. అనుక్షణము మితిలేనిజంతువులు జన్మించుచున్నవి. మితిలేనిజంతువులు మరణమొందుచున్నవి. సకలజంతుసామాన్యమైన యీమృత్యువునకు వివేకులువిచారింపరు. ప్రపంచము మహావృక్షము. జంతువులు దానమొలచినయాకులు. మృత్యువుమహావాయువు. ఈగాలివీచినతోడనె యాయాకులాకులపాటుం జెంది నేలరాలి మంటిఁగో

గలిసిపోవును. రాలినయాకులస్థానమునఁ గ్రొత్తయాకులు మొలు చును. చెట్లెప్పటివలె నాకులతో నిండియుండును. అట్లే జగము మనుష్యాదిజంతువులతో నిండి యెప్పటివలెనుండును. ఎవఁడుపో యిన నీప్రపంచమునకు వెలితిలేదు. సప్తద్వీపములేలు చక్రవర్తి మృతినొందినప్పుడును వీధిలోదిరుగు పుచ్చుకుక్కచచ్చినప్పుడును ప్రపంచమునకు నష్టముసమానమే. అందుచేత నావంటికి చిజ్ఞుఁ డొక్కఁడు మృతినొందుటవలన నెవరికేమియు నష్టముగలుగదు. చెట్లయాకులనిమిత్తమె యెట్లువిచారింపఁగూడదో మనుష్యాదిజం తువులంగూర్చిగూడ నట్లే వివేకులు విచారింపఁదగదు. కావున నానిర్యాణమున కొక్కముహూర్త మేర్పరుపుము.” జ్ఞానగర్భిత ములైన యారాజుమాటలు విని విక్రమార్కుఁడు మిక్కిలిసంత సించియిట్లనియె. “రాజా! నీవు వక్కాణించినదంతయు నిక్కము. నీసద్గుణంబులు పాశములై నాహృదయంబున జుట్టుకొని నీవంక లాగుచున్నవి. బ్రహ్మదేవుఁడు చిరకాలమునకు నీవంటియుత్తమో త్తముని సృజియించెను. కాని యామతిలేనిమూర్ఖుఁడు నీకు బలవ న్మరణము గలిగించెను. ఇట్టివానిని మరలసృజియించుట వానికిశ క్యముగాదు. నీమరణముచేత మధ్యమలోకమున కలంకారముబో వును. రాజకులారణ్యమున నుత్తమవృక్షమునశించును. ఎంతవిచా రించిన గార్యమేమి. ఆదుష్టకార్యముఁజేయకనాకుతప్పదు. నేఁడుపం చమిగదా. ఏకాదశినాఁడు ప్రాతఃకాలమున నీదుష్కార్యముజరుగుఁ గాక.” అని కన్నులనీటిచుక్కలుగార మారుమాటాడలేక చిన్నా లునన్తఃపురమునకరిగెను. మకరందుఁడు తనబసకరిగెను.

## పదియవప్రకరణము.

ఏకాదశి మకరందునకుఁ గడపటిదినమని పట్టనంబున వ్యాపించినతోడనే యుజ్జయినీ జనంబులెల్ల మిక్కిలి దుఃఖపడిరి. కొందఱు లాటరాజునునిందించిరి. దుష్టశీలయగు తనభార్యయందు నమ్మికయుంచి పంతమాడినందున మకరందునిదె తప్పని కొందఱు పలికిరి. తనసభలో నింత దారుణములగు పందెములను వేయు నిచ్చుట విక్రమార్కుని లోపమని కొందరనిరి. పూర్వజన్మకృతమున కేమిచేయవచ్చునని మరికొందరాడిరి. ఆమదానిని నమ్మినవారు చెడిపోక బాగుపడుదురాయని మరికొందఱుఁబలికిరి. కొంద రేకాదశీదినంబున మకరందుని మరణస్థానమునకు బోయి చూడదలంచిరి. మరికొంద రాదారుణ కార్యము చూడదగనిది కావున పోగూడదని నిశ్చయించుకొనిరి. తనమరణ మేకాదశి నాఁడు జరుగునని విన్నదిమొదలు మకరందుఁడు తనమనస్సు నన్యమార్గంబులం బోవనీయక సుస్థిరుఁడై వాచామగోచరము, సకల వేదాంత వేద్యము సకల ప్రమాణదృశ్యమునైన పరబ్రహ్మము నుధ్యానించుచుండెను. ప్రాకృతజనునకువలెనాతని కాసమయమున విచారముగాని భయముగాని కలుగలేదు. నేరముఁజేయని మనుష్యునకు రాజసన్నిధానము భయముకలిగింపనట్లె యీశ్వరసాన్నిధ్యము పాపములుసేయనివానికి భయముంగొలుపదు. భగవంతుని సాన్నిధ్యము సజ్జనునకు సంతోషము కలిగించునను మాట నాతఁడు దృఢముగా నమ్మి వెరపనునది యెరుగక

యుండెను. నడుమనడుమ మనసు ధ్యానబంధమునుండి విడిన ప్పుడు రెండువిచారము లాయన నించుక బాధించెను.

అంతవఱకు నేవిచారములేక బిడ్డలవలె పెరుగుచున్న ప్రజలింక నెవ్వనిపాలబడి యెట్టియిడుమల ననుభవింతురోయను విచారమొకటి. తనచెట్టబట్టి తనయంతఃపురము ప్రవేశించి నది మొదలుకొని సుగుణములదొంతియని పేరువడిన మణి మంజరి యపకీర్తిపాలై నదిగదా యని రెండవవిచారము. మణి మంజరినిగూర్చి విచారమేగాని యాతనికాగ్రహముఁ గలుగలేదు దశమినాఁడురాత్రి విక్రమార్కుఁడు మకరందునియొద్దకుఁ బోయి "నీదారపుత్రాదులను మిత్రులను దగ్గఱచుట్టములను జూడ నీకు గోరికకలదేని వారినిఁ బిలిపించెద. నీయభిమతముఁ జెప్పు మని" వేడుకొనెను. అందుకు మకరందుఁడిట్లనియె. "చూడ దగిన బంధువు నాదగ్గరనెయున్నాఁడు. అతఁడు తక్కినచుట్ట ములవలె స్మశానమువఱకు మాత్రమేరాక చిట్టచివరవఱకు నన్ననుసరించి వచ్చును. ఆతడెల్ల చుట్టములకంటె నెక్కుడుచు ట్టము. ఎల్లమిత్రులకంటె నెక్కుడుమిత్రము. అతడే నాకిప్పుడు దల్లియు దండ్రియు సుతుడు సోదరుఁడు రాజు రక్షకుఁడునై యున్నాఁడు.

ఆతనింజూచినకన్నుల మరియొకచుట్టమును జూడనొల్ల. అతనిందలఁచిన మనస్సుతో మరియొకనిం దలఁపనొల్ల. ఆతడు బంధమోక్షణము సేయు మహోపకారి. దారపుత్రాదులు బంధములలో దగిలించు శత్రువులు. ఈసమయంబున వారినెంత

మాత్రముఁ దలంపరాదు. కావున వారిని బిలిపింపకపోవుటయే నీవునాకుఁ జేయవలసిన మహోపకారము" అనవుడునాతని జ్ఞాన సంపత్తికి ధైర్యమునకు మిక్కిలిసంతసించి విక్రమార్కుఁడు "మిత్రమా మనుష్యాకారము ధరించిన హిమాలయాపర్వతము పగిలిపోవుచున్నది. గాంభీర్యసాగర మింకిపోవుచున్నది. మధ్యమ లోకమునకు గలుగువెల్తి మరల నెన్నిశతాబ్దములకుఁదీరునోగదా" అనినంతకంటె నెక్కువ మాటలాడలేక యుత్తరీయాంచలమునఁ గన్నీరుఁ దుడుచుకొనుచు నచ్చోటువాసిపోయెను. ఆరేయి నలు జాములు మకరందుఁడు పరమేశ్వరధ్యానపరాయణమైన చిత్త ముతోఁ గన్నుమూయ పుణ్యకాలక్షేపముచేసెను. నాలవజాము కోడికూసినతోడనే యతఁడులేచి స్నానముచేసి పరిశుభ్రములైన వస్త్రములు ధరించి మొగమున నూర్ధ్వపుండ్రములుఁదాల్చి కంఠ మున పుష్పహారము వేసుకొని మనంబున నించుకేనియు విచారము లేకయేదో సుముహూర్తమునకై యెదురుఁజూచుచున్న పెండ్లి కొడుకువలె ప్రాతఃకాలమునకై యెదురుచూచుచుండెను. పుర జనులు పెందలకడ మేల్కాంచి కాల్యకృత్యములఁ దీర్చుకొని మక రందుని మొగము కడసారి జూచుటకు వధ్యస్థానమునకు వెళ్లసాగిరి. సూర్యోదయ మగునప్పటి కాస్థలమంతయు నడుగుబెట్టుటకు చోటులేక మనుష్యారణ్యమైయుండెను. అచ్చటఁజేరిన మనుష్యుల ధ్వని సముద్రఘోషమును మించియుండెను.

అప్పుడు లాటరాజు చీనచీనాంబరములు ధరియించి వెలలేని భూషణములు దాలిచి తనపారసీకతురంగమునెక్కి మిక్కిలి సంతో

షముతో మకరందుని చెరమావస్థను జూడవచ్చెను. అప్పుడా చంద్రకేతువునుఁదిట్టనివారులేరు. వానిచావుఁ గోరనివారులేరు. మకరందుఁడు యవస్థకుఁ గన్నీరువిడువనివారులేరు. అంతలో మకరందుఁడు నలువురు తలారులు వెంటరానక్కడికివచ్చి యెత్తుగా నున్న యొకరాతిమంటపమెక్కి యొకవ్యాఘ్రాసనము మీఁద పద్మాసనము వేసుకొని గూరుచుండి తన్నుఁజూడ చేరిన ప్రజకు నమస్కరించి సూర్యునకు వందనముఁజేసి "తలారులారా! యిప్పుడు నాసిరమును దెగవేయుఁడు నేను సిద్ధముగా నున్నాఁడ" ననిపలికెను. అదివిని జనులందఱు హాహాకారమున నేడ్వఁజొచ్చిరి. కొందఱు లాటరాజుపై రాళ్లురువ్విరి. తలారి తల దెగవేయుటకుఁ గత్తియెత్తెను. అదిఁ జూడలేక జనులనేకులు కన్నులు మూసికొనిరి. కనులుఁ దెరచినవారుఁగూడ బాష్పధారలడ్డుపడుటచే నానిం జూడలేకపోయిరి. అంతలో వగర్చుకొనుచు నొకసేనకుఁ డచటికివచ్చి "కొట్టవద్దుకొట్టవద్దని విక్రమార్కమహారాజు నేటికావధ నిలుపు చేయమనియె" అని యరచుచు తలారిచేయి పట్టుకొనియె. మకరందునివధ నిలిచిపోయెను. లాటరాజు మొగము చిన్నఁబోయెను. జనులదుఃఖము సంతోషముగా మారెను. మకరందుని రాజభటులు గృహమునకుఁ దీసికొనిపోయిరి.



## పదియొకటవప్రకరణము

దశమినాఁడురాత్రి విక్రమార్కునకు నిద్దురపట్టనేలేదు. పట్టిన నయ్యది కోడికునుకుం బోలి నిమిషమాత్ర పరిమితిఁ గల దై యుండెను. మనస్సు స్థిమితముగా లేకపోవుటచే . నిద్రయు స్థిమితముగ లేకపోయెను. చిరమిత్రుఁడగు మకరందుఁడు తనసభలో వాదము చేసి తన యాజ్ఞాప్రకారముగ మరణదండనపా లగు చుండుటంజేసి యాతని మనస్సు కడుంగడు పరితాపము నొందఁ జొచ్చెను. కన్ను మూయగానె మకరందుఁడు తలార్లచేత వధిం పఁబడినట్లు వానిశరీరము నుండి రక్తము ప్రవహించినట్లు తన వద్ద నాతఁడు కడపటిసెలవు పుచ్చుకొనినట్లు స్వప్నము రాజొ చ్చెను. మేలుకొనియుఁ గలతనిద్దుర వోయియుఁ గలవరించియు నాతఁడు మూడుజాములు గడపెను. నాలవజామున నించుకేని యునిద్దుర పట్టలేదు. తెల్లవారబోవుచున్న దను జ్ఞానము కలుగఁ గానే మిత్రుని మరణము సమీపించుచున్నదను జ్ఞానము కలు గనాతని సంతాపము హెచ్చఁజొచ్చెను. ఇట్టిస తాపముచేత నతఁడు కుదురు లేక క్షణము మంచముమీఁదఁ గూర్చుండును. క్షణము పండుకొనును. క్షణము లేచి యిట్టట్టు నడచును. మక రందుని కడసారి చూడవలయు నని పదియడుగులు నడచును. ఇట్టి యవస్థలోఁ జూడ శక్యము గా దని మరల వెనుదీయును. అటులున్న యవస్థలో సేవకుఁ డొకఁడు వచ్చిచేతులు జోడించి "దేవా! ఇద్దరు స్త్రీలు వచ్చి ద్వారమువద్ద వేచియున్నారు మీదర్శనముఁజేయుట మిక్కిలి యవసర మట. దేవరవారి సెల

యయ్యో నేని వారిని లోనికి దోడ్కొనివచ్చెద." నని విన్నవించు టయు విక్రమార్కుఁడు "ఏమీ! స్త్రీలా! ఇద్దఱా! సరిగ దెల్లవారనైన లేదే. కనుచీకటి యుండఁగానె వారిటవచ్చుటకుఁ గారణమేమై యుండును చెపుమా? ఏమియాపద వచ్చెనో గదా! సత్వరము వారిని దోడ్కొనిర" మ్మని యానతిచ్చి "ఓసి! కువలయమాల! ఇటురా! ఇటురా!" యని పరిచారిక నొకర్తుఁ బిలిచెను. అప్పుడు కువలయమాల వచ్చి దేవా! యాజ్ఞాపింపుఁడని యెదుట నిలిచెను. "కువలయమాలా! ఎవరో యంగన లిద్దఱు నాతో నేదియో మనవిఁజేసికొనుటకై వచ్చి యున్నారఁట. వారేయుత్తమవంశమునఁ జనియించినవారో పరపురుషదర్శన మెన్నఁడుఁజేయని స్త్రీలైన నై యుండవచ్చును. అందుచేత వారు స్వేచ్ఛగా నాతోఁ బలుక నిచ్ఛగింపరు. నీవు వారితో మాటాడి వారికష్టము లేవో నాకెఱిఁగింపవలయు" నని విక్రమార్కుఁ డామెతోఁ జెప్పెను. అంతలో నాస్త్రీల నిద్దఱఁదోడ్కొని సేవకుఁడు ప్రవేశించెను. ఆయంగనలలో నొకర్తు మేలిముసుంగు వేసికొనియెను. రెండవయామె తల వాంచి తమ్ముఁ దోడ్కొనివచ్చిన సేవకునివెనుక నిలువంబడి యుండెను. మేలిముసుంగుఁ దాల్చిన యంగన కన్న రెండవయామె చిన్నది. కువలయమాల వారినిఁ జూచి "యమ్మా! మీరెవ్వరో యేదేశమో! రాజదర్శనంబునకు మిమ్ముం బురికొల్పిన కార్యమేదో మహారాజుగారు వినఁగోరుచున్నారు. మీమనోవేదన నివారణసేయుదురు. కావున సత్వరంబ మీరువచ్చినపని నివే

దింపు" డని పలికెను. క్రొత్తగావచ్చిన యాయిద్దఱంగన
లలోఁ జిన్నది యిట్లనియె. "అమ్మా! దీనదశలో నున్న
ప్పుడు మాకులగోత్రములు చెప్పుకొనుట పాడిగాదు. మా
యూరెందుకు పేరెందుకు. మేము వచ్చిన పనిచెప్పెదము.
మేము పాటకత్తెయలము. గానశాస్త్రమునందు మాకుఁగొంత
ప్రజ్ఞ కలదు. మేమిరువుర మొక్కచోటనే పెరిగినారము.
అక్కసెల్లెండ్రము కాముగాని యంతకంటె నెక్కువ మైత్రితోఁ
బెరిగినారము. కాని మాలో మాకిప్పుడు మచ్చరంబుఁ
గలిగినది. ఆమెకంటె నేనెక్కుడు పాటకత్తెయనని నేను తలంచు
చున్న దానను. తన కాలిగోరికైనను నేను పోల నని
యామె భావించుచున్నది. దిగంతవిశ్రాంతకీర్తులు గాన
కళారహస్యవేదులునగు విక్రమార్కమహారాజుగారు మాగాన
మునువిని మావివాదమునుఁ దీర్పవలయు. మేమనేక రాజస
భామందిరముల కరిగితిమి. అందెవ్వరు మావివాదంబులఁ దీర్ప
సామర్థ్యముఁ గలవారు లేకపోయిరి. అందుచేత విక్రమార్క
చక్రవర్తియె దీర్పవలయు" అప్పలుకులు విని విక్రమార్కుఁ
డిట్లనియె. "కువలయమాలా! నేను గానశాస్త్రమునం దంత
ప్రవీణుఁడను గాను. గంధర్వస్త్రీలం బోలిన వీరిరువురకు భేద
ముచెప్పుట కెంతవారుకావలయును. తుంబురనారదులవంటివా
రీవిషయమున ధర్మనిర్ణయము సేయుటకు రావలయును. నేను
తగను." అనవుడు మొదట పలికిన యాచిన్నదియె యిట్ల
నియె. "అమ్మా! కువలయమాలా! మహారాజుగారు గాన

కళాప్రవీణులయ్యు వినయమునకై తమ కేదియుఁ దెలియదను
చున్నారు. సర్వవిధములచేత వారు మావివాదములఁ దీర్పదగిన
వారని మాయభిప్రాయము. ఒకవేళ ధర్మనిర్ణయవిషయమున
తమకు సామర్థ్యము చాలదని మహారాజుగారు తలంచెడుపక్ష
మున వారి యాస్థానమున నిప్పుడు విదర్భరాజగు మకరంద
మహారాజు కలఁడని వినియుంటిమి. సంగీతశాస్త్రమున నాయన
తుంబురనారదులను మించెననిలోకమునఁ బ్రసిద్ధిగలదు. ఆయన
సహాయమున రాజుగారు ధర్మనిర్ణయము సేయవచ్చు."
ననుటయు విక్రమార్కుఁడు విషాదముతో "మకరందుఁ డొక్క
నిమిషములో మానవలోకమును విడిచిపోవును. సూర్యోదయ
కాల మగునప్పటి కారాజచంద్రుఁడస్తమించును. ఆతఁ డెట్లు
వచ్చి ధర్మనిర్ణయము సేయగలఁ"డని హీనస్వరముతోఁ బలికెను.
అప్పలుకులు వినగానె యాయంగన లిద్దఱు భయముచే వడంకిరి.
స్త్రీలగుటచే హృదయదారుణవార్త వినలేక యట్లు వడంకి రని
రాజు తలంచెను. అప్పుడాయిరువురలోఁ జిన్నది ముందుకువచ్చి
రాజున కెట్టయెదుట నిలిచి చేతులుజోడించి యిట్లనియె. "దేవా!
మకరందమహారాజునకు మీరు విధించిన మరణదండనము రేపు
జరుగునట్లాజ్ఞాపింపుఁడు. ఈసాయంకాలమున మావివాదము
నిర్ణయము సేయవచ్చును. మే మూడువాండ్రము. మీయాస్థాన
మున మావివాదము తీరునని కొండత యాసతో వచ్చియున్నా
రము. మార్గమధ్యమున నన్నపానముల కెన్నెన్నో యిడుములఁ
బడి యున్నారము. భోజనము చేసినచోట పండుకొనక, పండు

కొన్నిచోట భోజనముచేయక పయనంబునఁ బడరాని కష్టములఁ బడి యెట్టెటో మీసన్నిధికిఁ జేరిన యంగనల నిట్లు నిరాకరించుట న్యాయముకాదు. ఇప్పుడు మాకోరిక తీరదేని మేమిరువురము మీయెట్టయెదుట వజ్రపుఁబొడి మ్రింగి ప్రాణములవాయుదుము. మకరందుఁడు నేఁడు బోయిననేమి రేపు పోయిననేమి. ఈ విష యంబున మీరు మామనోరథము దీర్పకఁదప్పదు." అని ప్రార్థిం చుటయు విక్రమార్కుఁ డూరక కొంతవడి యాలోచించి "కువలయమాలా! ద్వారపాలకుఁడగు హయగ్రీవునిఁ బిలిచి మకరందుని మరణదండన మీదినమున కాపవలసినదనిఁ జెప్పుము. తెల్లవారినది. అప్పుడే మకరందుని వధ్యస్థానమునకు దీసికొని పోయి యుందురు. తక్షణమే వాని నక్కడకుబంపి మకరందుని మరణదండనము మాన్పింపు" మని త్వరపెట్టెను. "చిత్త"మని కువలయమాల యరిగి యాద్వారపాలకునిఁబంపి యాయంగనల నిరువురను దోడ్కొనిపోయి తగిన బసలో నుంచెను. ద్వారపాల కుఁడు వధ్యస్థానమునకుఁ బోయి మరణదండన మాపిన విషయ మిదివఱకేఁ జెప్పఁబడినది.

---

## పదిరెండవ ప్రకరణము.

పరమమిత్రుఁడు దురవస్థలో నున్నపుడు మనోహర గాన వినోదములతో గాలము పుచ్చుట విక్రమార్కున కెంతమాత్ర ము నిష్టము లేదు. కాని యతిసాహసలైన స్త్రీ లిరువురు వచ్చి తమ వివాదము న్యాయముగా బరిష్కరింపని పక్షమున

నాత్మహత్య చేసికొందు మని బెదరించుటచే విధి లేక యతఁడేకాదశినాటి సాయంకాలమున తన వినోదార్థము గాక కేవలము వారి వివాదము నివారించు నిమిత్తము సభఁగావించెను. ఆసభ విక్రమార్కుని యంతఃపురమందలి విశాల మైనయొక గదిలో జరిగెను. ఆసభలో విక్రమార్కుఁడు లాటరా జగుచంద్రకేతుఁడు, సింధురాజు, వ్యాకరణశాస్త్రమునందు మహాప్రజ్ఞఁ గలిగి పాణిని తరువాత పాణిని యంతవాడని పేరుగాంచిన వరరుచియు భేతాళభట్టు. మహాకవి కాళిదాసు, వరాహమిహిరుడు మున్నగు పండితచక్రవర్తులుఁ గూరుచుండిరి. సంగీతశాస్త్రమున నద్వితీయపాండిత్యముఁ గలిగినవాఁడును తుంబురనారదుల నైనశిష్యులుగ గ్రహియించి గానశాస్త్రమునందు శిక్షింపగలమేటి యని ప్రసిద్ధి గాంచినవాఁడును తన కంఠమునకును వీణ తీగెకును భేదము కనఁబడనంత విన్నాణముగ గానము సేయువాఁడును వేయేలమనుష్యాకారము ధరించిన గానశాస్త్రమని జనులచే గొనియాడఁబడువాఁడు నగువిదర్భరాజు మకరందుఁడు దీర్ఘమనోవిచారముచే శుష్కించిన శరీరముతో బాండిమము దాల్చిన మొగముతో మందమందము లగునడకలతో వంచిన తలతో నన్యవిషయాయత్త మైనమనస్సుతో సభామందిరమునకువచ్చెను. వచ్చినతోడనె విక్రమార్కుఁడాతని సగౌరవముగ నాదరించి తనప్రక్కను గూర్చుండబెట్టికొని యిట్లనియె. " మిత్రమా! మన యదృష్టవశమున భగవదనుగ్రహమున మరియొక్కదినము మనమందరముఁ గలసి మెలసి యుండు భాగ్యము

గలిగినది. మెడమీఁదికిఁ గత్తి వచ్చిన సమయమున మృత్యుముఖ మునుండి వెలువడుట యత్యద్భుతము. ఆశ్చర్యకరమైన యీ దైవసంకల్పమువలన నేదేని మేలొనగూడకపోవునా యని నా కాశ గలుగుచున్నది" అనవుడు మకరందుఁడు సన్నని కంఠస్వర ముతో రాజేంద్రా! మిత్రునియందు మీకుఁగల మహానురాగ మట్టి యాశాంకురములఁ బుట్టించు చున్నది. మీకు నాయందుఁ గలయపారకృపకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడ నగుచున్నాఁడను. కాని నేటి ప్రాతఃకాలమున నేనీశ్వరున కత్యంతస న్నిధానవర్తినై యుంటిని. ఈకార్యముచేత నన్నాయనకు మీరు దూరవర్తిని జేసినారు. ఈశ్వరపాదములయందు లగ్నమ యిన నామనస్సు మరల లౌకిక వ్యవహారములమీఁదికి మీరు త్రిప్పినారు. అనవసరమైన యీయాలస్యము నామనంబున కత్యం తబాధను గలిగించుచున్నది. ఇప్పటి యీ జీవనమే నాకు మరణబాధ. మరణమే నాకు జీవనము. అందుచేత మీకు నాస మాగమము సంతోషముగ నున్నను నాకీజీవనము, మరణము నుండిఁ గలిగిన యీ తాత్కాలిక విముక్తి, యీ మిత్రసమా గమము సంతోషప్రదములుగ లేవు. నాదృష్టి యూర్ధ్వమున బ్రసరించుచున్నది. నామనంబు పరలోక విషయముల వితర్కిం చుచున్నది. నేను కొంతకాలమునుండి చచ్చినవారిలోఁ గలిసి బ్రతుకుచున్నాను. బ్రతికియున్నవారికి జచ్చియున్నాను. నాకీగా నము చెవుల కెక్కునో లేదో యనుభయముఁ గలుగుచున్నది. మృత్యుదేవతాకోలాహలములే నాచెవినిఁ బడుచున్న" వని వై

రాగ్యభావముతోఁ బలికెను. పలుకుటయు విక్రమార్కుఁడు మక రందునిఁ జూచి "మిత్రుడా! ఈగానము నాకును సంతోష ముగా లేదు. నాచెవులకు నెక్కదు. విషాదముచేత నేనును జావకయు బ్రతుగకయు భూలోకనరకమనుభవించుచున్నాఁడను. అయినను స్త్రీలు మిక్కిలి యాదరణీయ లగుటచే వారి మొఱ విని నే నిందు కంగీకరించితిని. అదె వారు వచ్చుచున్నారు. ఎల్లెన సావధానచిత్తుఁడవై వారిగాన మాకర్ణించి వివాదముం దీర్పవలయు. నిన్నునమ్ముకొని గంపెడాసతో వచ్చియున్నారు. కావునవారినెల్లెన నను గ్రహింపవలయు"నని బ్రతిమాలుటయు "సరేనాశక్తికొలదిని విచారించి ధర్మనిర్ణయముఁజేసెద. నీముఖ సందర్శనముచేత కాళిదాసవరరుచి వరాహమిహిరప్రముఖులగు పుంభావసరస్వతుల సాన్నిధ్యవిశేషముచేత నిష్పక్షపాతమైన ధర్మ నిర్ణయశక్తి నాకుఁగలుగుఁగాక" యనిపలికి యూరకుండెను. అంతలో "వారెవారె. స్త్రీలువచ్చుచున్నా"రని కలకలముపుట్టెను వారిలోనిద్దఱు మేలిముసుంగులు దాల్చిరి. ఇద్దఱు హస్తముల యందు వీణియలుధరించిరి. ఇద్దఱు ఝుళుఝుళ మెఱయు నందియ లచే మునుముందు సభాసదులకు తమరాక నెఱిఁగించిరి. వారిని దూరమునఁ జూచినతోడనె విక్రమార్కుఁడు తనయంతఃపురపరి చారికల వారికెదురుగఁబంపి సగౌరవముగ వారినిరావించి తగిన తావునఁ గూర్చుండనియమించెను. అప్పుడు సభాసదులందఱు నిశ్శబ్దముగ వారివంకఁ జూడఁదొడఁగిరి. వారిరువురిలోఁ జిన్నది

తనస్థానమునుండి మెల్లమెల్లగలేచి చెలువంబడర నిలువంబడీ మిక్కిలివినయముతో సభాసదులనుద్దేశించి మృదుమధురస్వరంబుల యిట్లనియె "శ్రీమద్విక్రమార్కమహారాజ సభాలంకారములగువిద్వత్తిలకములకుఁజోహారు. భారతఖండమనెడి మహాకాశముననుదయించి మహాతేజంబుతో వెలయుచున్న విక్రమాదిత్యునకుఁజోహారు. మానవతీమానపరిపాలకుఁడని జగత్ప్రసిద్ధిగాంచిన మకరందమహాజునకుఁజోహారు.జగదేకవిచిత్రమగు నీమహాసభకుఁ జోహారు. దేవాఁ అవధరింపుడు. మేమంగనలముగానశాస్త్రమునందభిరుచిఁగలవారము. ఎవరైగానంబున నెక్కుడు ప్రజ్ఞగలదని మాలో మాకు మత్సరంబుదయించుటచే మాప్రజ్ఞలవిచారించి ధర్మనిర్ణయముసేయుమని మిమ్ముప్రార్థించుచున్నారము. ఈనిర్ణయము ప్రకారము మేమునడచుకొనియెదము. ఇది మా యిరువురప్రార్థనము. నాపేరుచంద్రలేఖ ఈనాచెలిమికత్తెపేరు రత్నప్రభ. ఇంక మేము గానమారంభించెదము. సావధానచిత్తులరై యాకర్ణింపవలయు. గానకళాకౌశలముచే రాళ్లనుగరిఁగింపఁజాలు మహావిద్వాంసులున్న యీసభామందిరమున స్వల్పజ్ఞానముకలయాఁగనలేమిపాడుటయేమియనితిరస్కరింపకదయార్ద్రహృదయులై మీచెవులనుమాగానమునకించుకసేపెరువియ్యవలయునని కోరుచున్నాను." అనిచంద్రలేఖకూర్చుండెను. ఆమెపలుకులు సభాసదుల హృదయమున కత్యంతానందమునుఁ గలిగించెను. ఈపలుకులు మకరందుని చెవినిఁ బడినతోడనె యతడు తనలో "ఏమిది అచ్చముగ నామెకంఠమువలెనె యున్నదే. ఆమెయిక్కడి కేల వచ్చు. కంఠమును బోలిన కంఠము లుండవా? సరే తెలియ

కపోవునా" యని వితర్కించుకొని యూరకుండెను. అంతట మునుముందు రత్నప్రభ గాన మారంభించెను. ఎడమభుజము మీఁద నించుక వాలునట్లు వీణియనొడిలో నిలువంబెట్టి యాయెల నాగ మునుముందు తీగలు సవరించి మేళవించి వీణవాయిం చెను. వాయించునప్పుడు వ్రేళులు తీగలకు తగులుచున్న వోలేవో యని చూపరులకు సంశయము గలిగెను. పాడునప్పు డుతంత్రీస్వరమో కంఠస్వరమో నిర్ణయించుట యనుభవశా లురకైన దుస్సాధ్యమయ్యెను. పల్లవి పాడునప్పుడు మనంబులు పల్లవించె. రాగము లాలాపనము సేయునప్పుడు మనంబుల నతిరాగంబు జనించె. ఆమెధన్యాసి పాడినప్పుడు సభాసదులం దఱామెను ధన్యాసి యనిరి. శంకరాభరణంబు నాలాపన జేసి నప్పుడు కన్నములలోనున్న శంకరాభరణములు సయితము వెలికి వచ్చుచున్నవేమోయని సంశయించిరి. మలయమారు తమెత్తుకొన్నప్పుడు మలయమారుతము వీచినట్లు హాయి హాయి యనిరి. కళ్యాణి పాడినప్పుడు కళ్యాణి కగళ్యాళి వశమ గుట యేమియాశ్చర్యమనిరి. అపశ్రుతి లేదు. రాగసాంకర్య ము లేదు. సభాసదులు కూర్చున్నవారు కూర్చున్నట్లె మలిచిన బొమ్మలట్ల యుండిరి. ఎన్నోసారు లానందపారవశ్యమున దన్మ యావస్థఁ జెందిరి. వరరుచి నోటికి విధివిరామము లేనట్లు హాయి హాయి యని పలుమారు లనెను. వరాహమిహిరుఁడు తన్ను దాను మరచెను. కాళిదాసుని మన సూర్ధ్వలోకమున నాట్య ముచేసెను. విక్రమాదిత్యుని మేన ముచ్చెమటలుపోసెను.

వేయేల సభాసదులు యప్పటి యవస్థ వర్ణింపు మని విక్రమా దిత్యుఁడు కోరిననుఁ గాళిదాసు లేశమేని వర్ణింపలేక యుండు నని నిశ్చయముగఁ జెప్పవచ్చును. కొంతవడి కాపాట ముగిం చెను. మహాసౌఖ్యములనందుచున్నట్లు కలఁ గనుచు నడుమ మేల్కాంచిన మనుష్యుఁడట్లు సభాసదు లందఱు పాటముగిసి నందుకు విచారించిరి. అనంతరము చంద్రలేఖ వీణియఁ జేకొని గాన మారంభించెను. ఆమె గానము కూడ సభాసదులనానంద వార్థి నోలలాడించెను. మిక్కిలి రుచిగలరెండుభక్ష్యముల భుజిం చిన వారువోలె సభాసదులు మిక్కిలి రుచిగల పాటలు మొగ మొత్తుటచే నత్యంతము సంతసించి యుండిరి. రత్నప్రభ గానము సేయునప్పుడు మకరందుఁడు పలుమారులామె మెవ్వ రై యుండు నని శంకించు కొని కారణములేనియనుమానంబు లఁ బడగూడదనిఁ దన్నుఁ దానె మందలించుకొని యూరకుం డెను. ఇరువురి పాటలోఁ దారతమ్యముఁ జెప్పవలసినదని సభాస దులు గోర మకరందుఁ డిట్లనియె. "చెవుల కమృతప్రాయము లై నయీగానములు రెంటిలోనిది యుత్తమమని నిర్ణయించుటకు మనుష్యమాత్రునకు శక్తి చాలదు. ఇరువుర గానప్రజ్ఞయు సమా నమే కాని రత్నప్రభ కంఠమాధుర్య మలోకసామాన్యమైనది. అందుచేత నామె యిరువురిలో నధికప్రజ్ఞావంతురా లని చెప్ప వచ్చు. అది నాయభిప్రాయము." అనవుడు సభాసదు లందఱు భళిభళీ ధర్మనిర్ణయము సరిగా నున్నదని మెచ్చిరి. చంద్రలేఖయు మీనిర్ణయము నేను శిరసావహించుచున్నదాన నని పలికెను.

అప్పుడు మకరందుడు "నామనస్సు పరిపరి విధంబులం బోవుచు
న్నది. నేనుకొంతసే పొంటిగ నుండవలయు నాకనుజ్ఞ నిండ" ని
రాజును సభాసదులను విక్రమార్కుని వేడికొని తననివాసమున
కరిగెను. అంతట విక్రమార్కు "డంగనలారా! మీగానకళా
ప్రవీణతకు మీరేమికోరిన నది యిచ్చెద. సత్యమెఱింగింపు" డని
యానతిచ్చె. వీరేమికోరుదురో వినవలయు నని సభాసదు లందఱు
మిక్కిలి యాత్రముతో నుండిరి.



## పదిమూఁడవ ప్రకరణము.

సమ్మోహనాస్త్రముల వంటి గానకళం బ్రయోగించి
సభాసదులను మూర్ఛితులుగా జేసిన యీయంగన లిరువురు
నేమికోరుదురో వినుటకై యెల్లవారు తత్తరపడుచుండ లాట
రాజు లేచి యెల్లరకు వినబడునట్లు విక్రమార్కునితో నిట్లనియె.
"రాజేంద్రా! ఈయంగన లేకోరికగోరిన మీరీయవచ్చుగాని
సంగీతశాస్త్రమందు ప్రవీణుఁడు గదాయని సంగీతశాస్త్ర
విశారద లగు వీరిరువురు మకరందుని ప్రాణములు రక్షించ
వలసినదని మిమ్మొకవేళ గోరుదురేమో. అట్టికోరికమాత్రము
మీరు ప్రసాదింపఁదగదు. మకరందుని ప్రాణములునాచేతనున్నవి
గాని మీచేత లేవు నేను కల్లబొల్లి జాలిపడి విడుచువాఁడనుఁ
గాను. వీరే కారు రంభోర్వశి మేనకలు వచ్చి నాట్యమాడి
యుతుంబురనారదులు వచ్చి గానము జేసియు నన్ను మెప్పించి

వరము వేడినను మకరందుని మాత్రము నేను బ్రతిగింపను కావున నట్టి కోరిక వీరుకోరవల దని జెప్పుడు.” ఈపలుకులు వానినోటనుండి వెలువడగానే సభాసదులలోనున్న ప్రతివును ష్యుడు తన మనంబున “ఛీఛీదురాత్మా” యని నిందించిరి. “చేజిక్కిన మేకను బ్రతికింపు మని పెద్దపులిని వేడుటయు నోటబడిన కప్పను వెడలగ్రక్కు మని పామును వేడుటయు మకరందుని రక్షించు మని నిన్ను వేడుటయు సమానములే. కావున నిన్ను మేమిట్టికోరిక కోరువారము కాము సుమీ” యని విక్రమార్కుడు ప్రత్యుత్తరము చెప్పెను. తోడనేచంద్ర లేఖ యిట్లనియె. “దేవా ! మేమంగనలమే కాని లోక్య మెరుంగని మూర్ఖురాండ్రముకాము. తలకుమీరినకోరికలుకోరుట తగదని మేమెరుంగుదుము. మేమేమి మాయునికియేమి? మీకు మాకుగల యంతరమేమి. అట్టికోరికలుగోరు టేమి. మాలోమాకు వివాదులుజనించుటంజేసి నాలుగుపాటలుపాడి మీయనుగ్రహము సంపాదించుకొనవచ్చినవారము. కావున నట్టికోరిక మేము కోరము. కాని యిప్పుడు నాకోరిక నేనుజెప్పెదవినుండు. సావధానులై వినుండు. మోమోటమునకు మోక్షమునకు చాలదవ్వను మాట స్మరణకుదెచ్చుకొనుండు. మనవాడు పెరవాం డనెడు పక్షపాతము నంకురింపనీయకుడు. ఈమహా సభలో నొకానొకపురుషుడుగలడు. అతడుమీకు సామంతరా జై యున్నవాడు. అతడు మహారసికుడు. విద్యావంతుడు.

గానకళాప్రవీణుఁడు. రూపవంతుఁడు. పరాక్రమశాలి. కాని ధర్మ
బుద్ధికలవాఁడుకాఁడు. ఆతఁడు నన్ను రహస్యమున వివాహము
జేసికొని కొన్ని దినములు నాతో నుండి తరువాత నామొగమైన
జూడక నన్నువిడిచినాఁడు. మరలనాతనితో నాకు సమాగమము
గలిగింపవలయునని ప్రార్థించుచున్నదానను.” అనుటయు సభా
స్థారులందరు విస్మితులై యొండొరులమొగంబులం జూచుకొన
సాగిరి. సభలోనున్నరాజులలో నెవనిమట్టుకువాడే యదితనను ద్దే
శించి యీయంగనపలికినదాయని సందేహింపఁజొచ్చిరి. లాటరాజు
తెల్లబోయెను. సింధురాజు గోడలవంకఁజూచెను. మగధరాజుప్ర
క్కనున్నవారితో గుసగుసలాడెను. ఈపిడుగు యెవ్వనిమీఁదఁబ
డునో తెలుసుకోవలెనని సభాసదులు తత్తరపడుచుండిరి. అపుడు
విక్రమార్కుఁడు “అమ్మా! చంద్రలేఖా వివాహమాడిన యిల్లాలి
నుసురుబెట్టి తానొకతగుమనుష్యుఁడై నాసభలోనున్న యారా
జెవ్వఁడో తెలియజెప్పుదువేని నిజమారసి తక్షణమే నీకోర్కెదీ
ర్చెద. లేదా వానినిదండించెద”నని బదులుజెప్పెను. అప్పుడు
చంద్రలేఖయు రాజవచనంబులకు సంతసించి మరల నిట్లనియె.
“దేవా! మహాభిమానియు మకరందనిర్మూలనప్రారంభుఁడునైన
లాటరాజుచంద్రకేతుఁడే నన్ను వరించి పిమ్మట నన్నువిడిచి నన్ను
గాసిపెట్టుచున్న మహాత్ముఁడు. ఇందు న్యాయము దయచేయవ
లయు” అనవుడు సభాసదులందరు మహాద్భుతచేతస్కులైరి.
లాటరాజు వెఱ్ఱిచూపులుచూచుచు సరిగా వినఁబడనిపలుకులతో

“నేనే మెరుగుదును. ఈనింద నామీఁద వేసినది.” యనిలోలోన గొణుగుకొనెను. “ఈవిధముగా నితఁ డెన్ని సంసారములు మాపెనో” యని సింధురాజు ప్రక్కనున్న వానితోఁ బలికెను. “ఓపికపట్టుడు. యింక నెన్నెన్ని గుణములు బయటికి వచ్చునో” యని యిం కొకఁ డనెను. సభవా రందరు గుసగుసలువోవ జొచ్చిరి. అప్పుడు విక్రమార్కుఁడు “లాటరాజా దీని కేమియుత్తరము జెప్పెదవు. ఈయంగనను నీవువివాహమాడితివా. ఆడితివేని నామె నేలవిడిచితివి” అని యడిగెను. అడుగుటయు లాటరాజు కోపము నభిమానము మల్లడిగొన నిట్లనియె. “మహారాజా ఈమె యేయుద్దేశముతో నామీఁద నీయపనింద మోపినదో నేనె ఱుంగను. ఆడుదిగదా యని ఆమాట వెంటనే మీరు విశ్వ సింపఁ దగదు. సత్యాసత్యములు విచారింపవలయును. ఈమెయె వ్వతెయో నేనెఱుంగను. ఈమె నెన్నఁడు నేను వివాహమాడ లేదు. అంతేకాదు. ఇది కేవల మసత్యకల్పనము. ఈయపనింద నామీఁద మోపుటకై నాశత్రు వు లెవ్వరో యీమెను ప్రేరే పించి పంపియుందురు. ఆమాటలు విని విక్రమార్కుఁడు “ అయ్యో ! యీధర్మ నిర్ణయము జేయువా రెవ్వరు. రహ స్యవివాహ మని చంద్రలేఖ జెప్పుచున్నది. ఆమె యౌనను చున్నది. ఇతఁడు కాదను చున్నాఁడు. భగవంతుఁడు తప్ప నిందలి సత్యమెఱుంగఁగలవా రెవ్వరున్నారు. ఇది దేవతలు దీర్పవలసిన వివాదముకాని మనుష్యులు దీర్పవలసిన వివా

దము కా" దని పలికెను. అనుచుండ నంతలో చంద్రలేఖ యిట్ల నియె. "దేవా? ఒక్కప్రశ్నము నేనీలాటరాజు నడిగి పిమ్మట నావాదము మానుకొందును. నాప్రక్కనున్న నాచెలిమిక త్తెయు నేనును గలసి మెలసి యుంటిమి. ఆమెను లాటరాజు మిక్కిలి చక్కగా నెఱుంగును. ఒకవేళ నీరాజు నన్నును నావివా హమును మరచిపోయెనేమో నామె మొగము జూచినతోడనే నీయనకు సమస్తము జ్ఞప్తికి వచ్చును. కావున నిప్పుడామె మొగ మితనికిఁ జూపెదను. నామొగము జూపినపక్షమున నితనికి పూర్వవృత్తాంత మొకవేళ జ్ఞప్తికివచ్చునేమో అందుచేత నామొ గముగూడఁ జూపెదను." అని ముందు తన మేలిముసుంగుఁ దీసివైచెను. ఆమొగంబుఁ జూచియు లాటరాజు "నేనెన్నఁడీ మెను వివాహమాడలేను. ఈమాట త్రికరణశుద్ధిగా జెప్పెద నని జెప్పగలను"అనియెను. అట్లయిన నాచెలి మొగమేయీవిష యమున సాక్ష్యమిచ్చి నాకార్యసాఫల్యము చేయఁగల" దని చంద్రలేఖ పలికెను.

---

## పదునాల్గవ ప్రకరణము.

"చెలీ రత్నప్రభా. యీసభాసదులకు సత్యమెరుంగఁ జేయవలెను. కాబట్టి నీమేలిముసుంగు నొక్కసారి యెత్తి నీము ఖారవిందమును లాటరాజునకు సభాసదులకుం జూపుము. నీము ఖసందర్శనము కాగానే సత్యము తేలును. నీమొగముఁ జూచిన

తరువాత లాటరా జన్నృత మాడలేదు. నీముఖముసూర్యమండ లమునుండి బయలుదేరిన కిరణములు వాడిగల యంకుశములై లాటరాజు నాలుక ననృతమువంకఁబోవనీయక నిజమార్గమున నిలుపును. చెలీ! నీ వెన్నఁడు పరపురుషుల యెదుట మేలిముసుం గులోనైన నిలిచినదానవు కావు. అటులుండ మేలిముసుంగు దీసి భువనైకప్రసిద్ధు డగువిక్రమార్క-మహారాజ సభామండప మున నిలువవలసిన దని నిన్నుఁగోరుటలో నేను మిక్కిలి కాఠి న్యము వహించి యుండవచ్చును. కాని సత్యప్రకటన నిమిత్తము మన మొకప్పుడు కాఠిన్యము వహింపవలసి వచ్చును. ఇందు దోష మేమియు లేదు. మనశ్శుద్ధి యుండెనా మన మొగము నెందరు జూచినను నష్ట ముండదు. అంతఃకరణశుద్ధి లేక పో యిన తరువాత మొగ మెన్ని మేలిముసుగులలో వేసి దాచి నను ప్రయోజనము లేదు. అంతఃకరణశుద్ధిలో నీకరుంధతి సాటి. అనసూయసాటి. చంద్రమతి సాటి. దమయంతీ సాటి. సీత సాటి. సావిత్రి సాటి. ఈసభాసదులు పవిత్రచరిత్రులు. ఇందులో నున్నవయోవృద్ధులు నీకగ్రసోదరులు, తండ్రులు. నీకన్న చిన్న వాండ్రు, నీకు తమ్ములు, నీకు కుమారులు. తండ్రులకు నన్న దమ్ములకు మొగంబును జూపుటకై కాంతలు సందేహింపరాదు. సూర్యమండల సందర్శనముచేత దూరముగా బోవు చీకట్ల వలె నీవదనసందర్శనముచేత నపవిత్రంబు లగుతలంపు లేమూల నైననొకవేళయుండినను పటాపంచలై పోవును. నీపావనచరిత్రము

ను నగ్నిహోత్రముచేత దుష్టుల హృదయమాలిన్యము భస్మీభూత మగును. కావున నిశ్శంకముగా నీమేలిముసుంగు నెత్తుము. కాదు కాదు. ఉండు, నేనే యెత్తెదను.'' అని చంద్రలేఖ రత్నప్రభనుద్దేశించి పలికి యామె మేలిముసుగు మెల్లమెల్లగఁ దన చేతులతో నెత్తెను. రత్నప్రభయు నందు కిష్టపడి యూరకుండెను. ఆముసుంగు నెత్తినతోడనే మబ్బులోనుండి వెడలిన చంద్రమండలము పగిది, పొగ విడిచిన యగ్నిజ్వాలవలె పెట్టెలో నుండి తీసిన రత్నంబుకరణి మన్మథునిచేతి సమ్మోహనాస్త్రంబు భాతి యామోహనాంగి ముఖారవిందము సభాసదుల కన్నులకుఁ బండువుచేసి వారిని మహానందవార్ధి నోలలాడించెను. రత్నప్రభ తల వంచుకొని నేల జూచుచుండెను. ''ఆవిశాలనయనంబులకు ఆవిశాలనయనంబులే సాటి. లావణ్యరాసి యైన యామొగమునకు ఆమొగమే సాటి. ఆచక్కదనంబునకు ఆచక్కదనంబే సాటి.'' యని యుపమానము లేమియుఁ దోపకుండుటంజేసి సభాసదులు తలంచిరి. ఊర్వశిని శకుంతలను మాళవికను రసికజనహృదయానందముగా వర్ణించిన కాళిదాసు తన మహాకవిత్వ మంతయు నీమెను వర్ణించుటకు జాల దని యొప్పుకొనెను. అనేకాంతఃపురకాంతలఁ జూచిన విక్రమార్కుఁడు తన జన్మమధ్యమున నిట్టి చక్కదనమును జూచి యెరుంగ ననియు, నికముందు జూడఁ గల భాగ్యముము తనకు పట్ట దనియు మనంబున ననుకొనెను. ఆలావణ్యమంతయును జూచుచు కన్నుల

రెప్పపాటు లేక యుండుటంజేసి యాసభాసదు లందరు క్షణ కాలము దేవత లైరి. మేలిముసుగుం నెత్తిన గడియవఱకు సభా సదులు పరమేశ్వరుని మహాద్భుతసృష్టులలో నొకటియగు నామె ఖమును జూచుచు నెంతజూచినం దనివినొందక మరల జూచు చుండిరి. క్రమక్రమంబుల నట్టియాశ్చర్యము మందగింప నాయ దనుగనిపెట్టి చంద్రలేఖ లాటరాజునుగూర్చి యిట్లనియె. "ఓచం ద్రకేతుమహారాజా! నీవు నన్ను పాణిగ్రహణముచేయ లేదని పలికి తివి. నాచెలిమొగంబుజూడుము ముందుగా నాసన్నిధిని యీామె నెన్నడైనజూచితివో లేదో జెప్పుము. ఈమాటకుత్తరముజెప్పుదు వేని పిమ్మట నడుగవలసిన యవసరమున్నపక్షమున నావృత్తాం తము నే నడిగెద. కాబట్టి యీప్రశ్నమునకుముందుత్తరమిమ్ము." అనవుడు లాటరాజు తనస్థానమునుండి లేచి సభప్రతిధ్వనులిచ్చు నట్లుగా నిట్లనియుత్తరమిచ్చెను. "ఓచంద్రలేఖా అంగనయందెన్ని మాయలుగలవో నీయందన్నిమాయలుగలవు. నీవు మాయలపా ములపుట్టవు. కాదు కాదు. నీవే నల్లత్రాచుపామువు. అబద్ధపు పలుకులనెడువిషముచేత నాకీర్తిశరీరమును జంపదలంచుచున్నావు. నేనునిన్నువివాహమాడుటయెంతనిజమో నీచెలికత్తెనుం జూచుట యంతనిజము. నేనునిన్ను వివాహమాడలేదు. ఈయంగనను నీస న్నిధినెన్నఁడు జూడలేదు. నీసన్నిధినేకాదు. జన్మమధ్యమున నిం తకుముందెన్నఁడును నీమెనుఁజూడలేదు. ప్రత్యక్షముగాజూడలేదు సరేకదా కలలోనైనఁ జూడలేదు. ఈమెప్రతిబింబమునైనఁజూడ

లేదు. ఇందుకుభూమిసాక్షి. యాకాశముసాక్షి. సూర్యుఁడుసాక్షి. చంద్రుఁడుసాక్షి. విశ్వమంతయుసాక్షి. నేనీమెను జూచియుండి యబద్ధమాడినపక్షమున శిశుహత్య, స్త్రీహత్య, బ్రహ్మహత్య, గోహత్య మొదలగుమహాపాతకములుచేసిన మహాపాతకులు పోవు దుర్గతులకుఁ బోవుదును. అంతఃకరణశుద్ధిగాబలుకుచుంటి. ప్రమాణముఁజేసి పలుకుచుంటి. నమ్ముఁడు నమ్ముఁడు." అనవుడు చంద్రలేఖ రత్నప్రభ మొగంబును మరల మేలిముసుంగువైచినభాసదులతోనిట్లనియె. "మహాత్ములారా! ఈయనపలుకులు మనంబునగట్టిగానిలుపుకొనుఁడు. నావాదము నేను వదలుకొనుచున్నాను. ఆయన జెప్పినదంతయు సత్యముగామీరుగ్రహింపుఁడు. ఆయన నన్ను వివాహమాడలేదని మీరె తీర్పుఁజేయుఁడు నాచెలి మొగమెన్నఁడు నీయన చూడలేదన్నమాటయు నిశ్చయముగా మీరు నమ్ముఁడు" అనవుడు విక్రమార్కుఁడు "సుందరీ నీకోరిక నిష్ఫలమైనదే" యనెను. అన చంద్రలేఖ "దేవా! నాకోరిక సంపూర్ణముగా మీకుఁ దెలియఁజేసెద క్షణమోపికపట్టు" డని యీవిధంబునఁ జెప్పఁదొడంగె.

---

## పదిమూడవ ప్రకరణము.

"దేవా! విక్రమార్క మహారాజా సాహసవిక్రమార్కుఁడని జగదేక విఖ్యాతి గాంచిన నీయెదుట నీమహాసభయెదుట నావంటి యాఁడుది, కొఱగానియాఁడుది తెలివిమాలినయాఁడుది సాహసముచేసియొకానొక సాహసపుం బలుకు పలుకుట మహాసాహసములలో సాహసము. నానోటనుండి నాకోరిక వెలువడక ముందు మకరంద మహారాజు నొక్కసారి యిక్కడకు పిలిపింపవలయు. మాయిరువురి వివాదంబు తేలినట్లెయాయనవలన నీవివాదంబు గూడ నిశ్శంకముగా దేలును." అని చంద్రలేఖ బలుకుటయు విక్రమార్కుఁడు పరిచారకు నొక్కనిం బిలిచి మకరందునిఁ దోడ్కొని రమ్మనియె. ఆపరిచారకుఁడు వెంటనే యఱిగి మకరందునకు విక్రమార్కుని యాజ్ఞ నెఱిఁగించెను. తన్ను మహారాజు పిలువనంపిన కారణ మేమని మకరందుఁడు పరిచారకుని గుచ్చి గుచ్చి యడిగి వానివలన చంద్రలేఖ లాటరాజుపై మోపిన నిందయు నామె చెలికత్తెను సాక్ష్యము గోరుటయు నామె మొగమే చూచియుండ లేదని లాటరాజు పలుకుటయు లోనుగాగల వృత్తాంతము నెఱింగి మెల్ల మెల్లగ సభలోని కరిగి విక్రమార్కుని చేత గౌరవింపఁబడి వాని ప్రక్కను గూర్చుండెను. "నన్నేల మరల బిలిపించితి" రని మకరందుఁడు విక్రమార్కు నడిగెను. "నేను పిలిపించలేదు. ఆకాంత పిలువమన్న" దని విక్రమార్కుఁడు బదులు

చెప్పెను. మేలిముసుంగులోనుండి రత్నప్రభ మకరందుని మొగ
ముఁజూచి వెచ్చని బాష్పబిందువులు విడువఁజొచ్చెను. విక్రి
మార్క మకరందులకు జరుగుచున్న సంభాషణ మాలకించి
చంద్రలేఖ మకరందుని కుత్తరంబుగ విక్రమాదిత్యునితో నిట్లని
యె. "మహాప్రభూ! మకరంద మహారాజును బిలువనంపిన
కారణము క్షణకాలములో నెఱుంగఁజేసెద. ముహూర్తకాల
మోపికపట్టవలయునని ప్రార్థించుచున్నదానను. లాటరాజు నన్ను
వివాహముచేసికొనలేదని కంఠోక్తిగఁ బలికెను గదా. ఆయన
మాటయె సత్యముగ మీ రు పరిగ్రహింపుఁడు కాని
యీసందర్భములో నాచెలిమికత్తె మొగ మెన్నఁడాయన చూడ
లేదని ప్రమాణముచేసి పలికెను. ఆకాశము సాక్షిగ భూమి
సాక్షిగ నగ్నిసాక్షిగ సూర్యుఁడు సాక్షిగ చంద్రుఁడు సాక్షిగ
నీమెమొగ మెన్నఁడు జూడలేదని స్వప్నముననైనఁ జూడలేదని
ప్రతిబింబమైనఁ జూడలేదని వర్ణనమైన వినలేదని మీయందరియె
దుట వాక్రుచ్చినాఁడు. ఈమాట సత్యమేనా యనిమరల నేన
డుగుచున్నదానను." అనవుడు లాటరా జెలుగెత్తి "సత్యము
సత్యము. ఈమె నెన్నఁడు నేను జూడలే దని మరల నొక్కి
పలికెను. అప్పలుకు లూతగాగొని చంద్రలేఖ సభాసదు
లచ్చెరువడ నిట్లనియె. "విక్రమార్క మహీపాలా? విబుధు
లార విద్వాంసులార సామంత నృపాలులార మీరందఱు నాల
కింపుఁడు. లాటరాజా! నీవాలకింపుము. కొలనుబాసిన తామర

పూవువలె నవసి మగపక్షింబాసిన చక్రవాకివలె నిద్రాహారం బులులేక విలపించుచు నతిప్రయాసమున నెట్లెటో నిలువాసి గహ నాంతరంబులుగడచి పయనంబుచేసిమీారాజధానిఁజేరి మీాసన్నిధా నంబువడసి మీాయనుగ్రహంబునకుం బాత్రమై గానకళాకౌశలము చేత మీాహృదయంబులుగరగించి మీామెప్పువడసి మీాకరుణాక టాక్షము నిప్పుడపేక్షించుచున్న యీాయబల విదర్భరాజుధర్మ పత్ని మణిమంజరి. ఈమహాపతివ్రతనె భంగపుచ్చెదనని లాట రాజు మీాయెదుట నసత్యములువలికె. ఈమహాపతివ్రతభర్తనే లాటరాజు శిరచ్ఛేదముచేయింపదలచినది. ఈమెమీాదనేచంద్రకేతు శపవాదంబులుపన్నినది మీాయెదుటనేగదా. మీారు చెవులార వినుచుండఁగనే కదా యీాశఁడీమెనెన్నఁడుఁ జూచియెఱుంగనని ప్రమాణముచేసిపలికెను. ఈమె మణిమంజరి కావని సందియ పడు దు రేమో మకరందమహారాజా! ఈమెమొగముచూచినీవుసత్యము వచింపుము. ఇదిగో చిరవియోగాగ్నిచే గృశించిన యీామెమొగ ముని" యామెమేలిముసుంగెత్తి చూపి మరల నా ముసుంగువై చెను. ఆమొగముఁ జూచినతోడనే "హామణిమంజరీ మణిమం జరీ" యని మకరందుఁ డద్భుతవిషాదములతో విక్రమార్కుని మేనంజేరఁబడెను.విక్రమార్కుఁడాతనిఁబట్టుకొనిమిత్రుఁడాధైర్యము దెచ్చుకొమ్మని యూరడించెను. చంద్రలేఖ పలుకులు లాటరాజు చెవుల పిట్టపిడుగులట్లుపడెను. పిడుగుపడిన చెట్టువోలె నాతఁడు నల్లనిమొగముతో గూర్చుండలేక క్రిందఁబడెను. మాటలాడఁద

లంచినను వానినోట నొక్కమాటయైన వెలువడదయ్యె. "అవు నుకాదు లేదు పాపము పాప" మను నర్థములేనిమాటలుమా త్రము హీనస్వరముతో వానిపెదవులనుండి బయలుపడెను. తన ప్రతిష్ఠకు తన ప్రాణమునకు భంగముకలిగినదని యాతడప్పుడు విచారింపఁజొచ్చెను. విక్రమార్కుఁడు మణిమంజరి తనమిత్రుని భార్యయనుమాటవినగానె యద్భుతరసమగ్నుఁడయ్యెను. "ఛీ! దురాత్ముఁడు పాపాత్ముఁడు. ముక్కలుగనరికినను బాపములేదు. మనుష్యుఁడుకాఁడు. రాక్షసుఁడు. పాపమైనవీనికన్నమంచి" దను మాటలు సభాసదులనోళ్ళనుండి వెలువడి శూలములవలె చంద్ర కేతుని చెవుల నాటఁజొచ్చెను. చంద్రలేఖ పలుకులకంటె యామె చూపులు మిగుల భయంకరములై చంద్రకేతుని మనసును బా ధింపఁజొచ్చెను. సభాసదులస్థితియటులుండ చంద్రలేఖ వెండియు నిట్లనియె. "మహాత్ములార! నే నామె ప్రియసఖి నగు రాజముఖిని. ఈలాటరాజు మీసభలో నేమేమో పంతములాడి మాయంతఃపురమందుఁ బని చేయుచుండిన మోసకత్తెయగు దాసి నొకర్తుఁజేరఁదీసి దానికి లంచము లిచ్చి మామహారాజు గారు మాదేవి కిచ్చిన మొలకత్తియు ముద్దుటుంగరమును దాని చేత దెప్పించి తాను మాదేవి మానభంగము సలుపుట కవి యానవాళ్ళుగఁ జూపి మారాజు శిరస్సు ఖండింపఁదలంచినాఁడు. ఈతనికంటె మహాపాతకులు లేరు. ఈతఁడు మనుష్యుఁడుఁ గాడు. ప్రత్యక్షరాక్షసుఁడు. మీచెలిమికి తగఁడు. మీసభలోగూర్చుం

డుటకుఁ దగఁడు. మీతోఁ సంభాషింపఁ దగఁడు. మేమీమారు
వేసములు వేసికొనియీవంకను మీదర్శనముఁ జేయఁబట్టినీమహా
రాజు జీవించెను. కాని లేనిచో నీపాటి కాయన స్వర్గస్థుఁడై యుం
డును గద! లాటరాజా! రాజశబ్దము నీకుతగదు. నీవు క్షత్రియుఁ
డవు కావు. మనుష్యుఁడవు కావు. కాలుసేతులు మొదలగు నవయవ
ములతోఁ బుట్టిన పెద్దపులివో త్రాచుబామువో నీజన్మముచేత
క్షత్రియకులము, కాదు కాదు, మానవజాతియపవిత్రమైనది. నీ
రహస్యము దాగుననుకొంటివా? పాపము బిడ్డలుకాకుండునా?
ఎవ్వాని దృష్టికి కించిజ్ఞులైన నీవంటి రాజులు చీమలకంటె నికృ
ష్టజంతువులుగ గనఁబడుచుందురో, యెవ్వానిదేహము ధర్మమ
యమో, యెవ్వానికృపారసంబునకు మేరలేదో, పక్షపాతం బెవ్వా
నిదరికిఁజేరదో, యట్టిరాజాధిరాజు లోకైకచక్రవర్తియగు పరమే
శ్వరుఁడు సహస్రనేత్రములతోఁ నీపాపములఁ జూచుచుండుట
లేదా? నీది హృదయముగాదు. శిలకన్న నినుముకన్న వజ్రముకన్న
నీహృదయము కఠినతరము. అది హృదయమే యైనపక్షమున మాన
వజాతికిసామాన్యమగుదయారస మొక్కబిందువైన హృదయ
మున నున్న పక్షమున నీలావణ్యరాశికి నీగుణపేటి నీపతివ్రతాశిరో
మణికి నిట్టి మహాపదఁ దెచ్చిపెట్టుదువె. అవమానము భర్తృమర
ణము నను రెండుకష్టములు దెచ్చిపెట్టితివి. లావణ్యమును గ్రక్కు
నీమె మొగమునకా నీవు వైధవ్యమును తేదలంచితివి? ఈనేత్ర
ములనుండి యా నీవు బాష్పబిందువులు కురిపించితివి? ఆమహా

రాజునా నీవుచంపదలంచితివి? నరకమనునది యున్న పక్షమున భగ వంతుఁడు దుష్టశీలురకు నరకము విధించుట యున్న పక్షమున నాన రకూపంబులె నీనివాసంబు లగుగాక ! ఈమహాపతివ్రత యుసురు నీకు వేయిజన్మంబులవఱకుఁ దగులుఁగాక!"

## పదియాఱవ ప్రకరణము.

అట్లు చంద్రలేఖ గంభీరస్వరముతో లాటరాజు నధిక్షే పించుటయు విక్రమార్కుఁడామె సమయోచిత బుద్ధికి ధైర్య మునకు సాహసంబునకు మెచ్చి విస్మితుఁడై లాటరాజుతో నిట్ల నియె. "చంద్రకేతుఁడా! నీమనోవృక్షంబున బయలుదేఱిన పాపపుష్పము నీవెంతగప్పిననుఁ గప్పఁబడక తనదుర్వాసనలు వెదజల్లినది. ఇప్పుడు నీవేమనియెదవు? మణిమంజరీ పాతి వ్రత్యమును భంగపుత్తునని ప్రతినపట్టి యోడిపోతివి. ఏదోవిధం బున దయామయుండగు మకరందునిఁ బ్రతిమాలుకొని ప్రాణం బులుదక్కించుకొనక ఘాతుకకృత్యంబునకుం జొచ్చితివి. మహా పతివ్రతయగు మణిమంజరీదేవిమీఁద నపవాదంబులు పన్నితివి. ఇంతకంటె మహాపాతకము లేదు. ఈపాతకమునకు ప్రాయశ్చి త్తములేదు. అట్లొకమాయోపాయంబున మానధనుఁడగు మక రందుని ప్రాణములు తీయఁదలంచితివి. నీ చేతులతో నీవు త్రవ్వుకొన్న యీపాప సముద్రమునకు పారములేదు. ఆసముద్ర

ములోన నీవు మునిగిపోవుచుంటివి. నీమాటలా సముద్రము లోని తరంగములు. ఇప్పుడైననీవు పశ్చాత్తాపపడి క్షమియిం పుమని మకరందుని వేడికొనుము. " అవమానముచేత నదివఱకే క్రుంగిపోయియున్న లాటరాజు మరింత నమ్రుఁడై యిట్లనియె. "దేవా ! నేనుమహాపాతకుడను. రాజశబ్దమున కనర్హుఁడను. అకార్యముచేసి నావంశమునకు మాసి పోవని మచ్చఁ దెచ్చితిని. నేను నీసభలోనుండుట కనర్హుఁడను. పరమపతివ్రతా తిలకము యొక్క యుసురు నాకు తగులకపోదు. వెల్లగిలఁబండుకొని మను ష్యుఁడు పై కెగర వేసినరాళ్లు తనకేతగిలినట్లవివేకముచేత నేను పన్నిన మాయోపాయములు నన్నేకొట్టినవి. నామనసిప్పుడు పశ్చాత్తాపముచేత మండిపోవుచున్నది. పందెమునం దోడితిని. పతివ్రతను బాధపెట్టితిని. మకరందుని మరణ మొందింపఁ దలం చితిని. చిరకాలమునుండినేను సేవించిన యీయసత్య దేవతకు సంపూర్ణముగాఁ దృప్తి పొందునట్లు నాశిరస్సు బలియియ్యవలెను. కాని నాయందు దయయుంచి మీరునన్ను క్షమియింపవలయును. మకరందమహీపాలా ! అగ్నిహోత్రమునకుఁ జెదలుపట్టవు. బంగారము త్రుప్పుపట్టదు. నావంటిదోషాత్ముఁడు మదముచేఁ గొన్ని వ్రేలినను మిక్కిలి పవిత్రమైన నీయంతఃపురమునకు మాలి న్యమంటదు. నీయిల్లాలు సకలపాపాంధకారమును దూర ముగదోలు జ్యోతి. కళంకములేని చంద్రమండలము. నేనామె పుత్రుఁడను. ఆమె నాకుమాత. పశ్చాత్తప్త మనస్కుఁడనైనా

చర్యకు నేనే సిగ్గుపడి పలుకుచున్న పలుకులివి. ఆమెనిర్దోషు రాలు. ఆమెపై నీకు నాకతంబున ననుమాన ముదయించియుం డును. ఆయనుమానమును దూరముగ బారదోలుము. నన్ను క్షమింపుము. ఆమెనుస్వీకరింపుము.'' అని పలికి భయముచే తనో పశ్చాత్తాపముచేతనో వలవల యేడ్చెను. వెంటనే మక రందుని హృదయము కరఁగెను. కరఁగుటయు నత డిట్లనియె. ''లాటరాజా! మహాపాతకములకెల్ల పశ్చాత్తాపమే యుత్తమ ప్రాయశ్చిత్తము. ఆప్రాయశ్చిత్తము నీకుఁ జరిగినదిగావున నీవి పుడు శుద్ధుఁడవు. శరీరమునకు స్నానముచేత శుద్ధిగలుగునట్లు మనస్సునకు పశ్చాత్తాపస్నానముచేత శుద్ధిగలుగును. పుటము పెట్టుటతోడనె మాలిన్యము దొలఁగి బంగారమునకు శుద్ధిగలు గునట్లు పశ్చాత్తాపమను పుటంబున వెట్టినతోడనె మాలిన్యము దొలఁగి మనస్సు శుద్ధియగును. శరీరమునకువలెనే మన స్సునకుఁగూడ వ్యాధు లుండును. పాపపుఁ దలంపులుమనంబును పీడించు వ్యాధులు. ఆవ్యాధులకు మహానీయుల యుపదేశం బులె మందులు. పదిమందిలోబడిన పాముపలెనే పదిమందిలోబ డిన పాపమునయితము నశియించును. నీహృదయమిప్పుడుపశ్చా త్తాపమహాగ్నికి గొప్పకొలిమియై మహాపాపము లనియెడుగట్టి యినుపతునుకలను గరగించుచున్నది. నీవిప్పుడు శుద్ధుఁడవైతివి. విక్రమార్కుఁడు క్షమియించినాఁడు. భగవంతుఁడు క్షమియిం చును. నాభార్యనిప్పుడు నేను స్వీకరించుచున్నాను. ఆమె నిష్క-

ళంకచరిత్ర. నామనంబు ననుమానమనియెడు మంచుఁగమ్మటచే
నామె శుద్ధచరిత్రమనియెడు సూర్యమండలము కొంతకాలము
పొడగట్టలేదు. అందుచేత విషాదమనియెడు నంధకారమునమునిఁ
గిపోతిని. ఇప్పుడు నిష్కళంకమతితో నేను స్వీకరించుచున్నాను.
ఆపలుకులువిని సింధురాజులేచి సభాసదులతో నిట్లనియె. "విక్ర
మార్కమహీపాలా! సభాసదులారా! లాటరాజుచేసిన దుస్తం
త్రములన్నియు మీకుఁదెలిసినవిగదా. ఈతఁడుఁబన్నినమాయోపా
యంబులనియెడువలలలో మకరందుడుచేపవలెజిక్కిపోయెనుగదా.
మణిమంజరీదేవియొక్క సమయోచితబుద్ధి విశేషంబునను రాజ
ముఖి ప్రజ్ఞావిశేషంబునను నీతఁడుబ్రతికెనుఁ లాటరాజుచేసినవన్ని
యు నకార్యంబులు. పలికినవన్నియు నవాచ్యంబులు, కావుననితఁ
డుచంపదగినవాఁడు. ఈతని క్షమియించుట పాపములంబెంచుట.
పాపాత్ములకుఁ బ్రోత్సాహముకలిగించుట. కావుననీతఁడువధ్యుఁ
డు వధ్యుఁడు వధ్యుఁడు.ఇట్టివారిని వధించుట లోకోపకారము.
బ్రతికించుట లోకాపకారము" అని మరియుంబలుకఁబోవుచుండ
మకరందుడువానిమాటకడ్డమువచ్చి యిట్లనియె. మిత్రుడా!సింధు
రాజా! అట్లుఁబలుకవలదు. మనుష్యులకు జంతువులకుఁగల భేద
మొకటియున్నది. మనుష్యులకు స్వార్థత్యాగము దయారసము
మొదలగు లక్షణములుగలవు.జంతువులకవి లేవు. అందులోఁజేసిన
యకార్యమునకు జింతిల్లినవానిని ముందుగాక్షమియింపవలయును.
అట్లు చింతిల్లక పట్టుపట్టి తనపాపకార్యమునందె ప్రవర్తిల్లుచున్న

వానిని దండింపవచ్చును. ఈతఁడు పశ్చాత్తాపమునొందియు న్నాఁడు. కావున క్షమియింపవచ్చును." అనవుడుమకరందుని యౌదార్యమునకు మనోవైశాల్యమునకు సభాసదులందఱు విస్మితులై సంతసించిరి. మణిమంజరీదేవియు లాటరాజునుక్షమి యించి బ్రతికించుట తనకోరికయని రాజముఖిచేత విక్రమా ర్కునకు మకరందునకు జెప్పించెను. విక్రమార్కుఁడునట్లే కే తుని క్షమియించి మకరందుని మణిమంజరిని దన యంతఃపురము నకుఁ దోడ్కొనిపోయి కొన్నిదినములచ్చట వారిని సగౌరవముగ నాదరించి యనంతరము వారిపట్టణమునకుఁ బంపె. విదర్భాపుర జనులు తమరాజు తమకు మరల దక్కివచ్చినందులకు, తమమా తృసమానయైన మణిమంజరీదేవి నిష్కళంకచరిత్రయై, బయటప డినందుకు మహానందభరితులై యుత్సవంబులఁ జేసికొనిరి.

సమాప్తము.

## పద్యకావ్యములు.

| | | |
|---|---|---|
| రాధామాధవ సంవాదము | వె. వేంకటపతి | 0-12 |
| గోపాలలీలాసుధాలహరి | ప్ర. కామేశ్వరకవి | 0-12 |
| గోపాలలీలావిలాసము | కాళయ మహాకవి | 0-12 |
| సుభద్రాపరిణయము | కూ॥ జగ్గకవి | 0-12 |
| ద్రౌపదీపరిణయము | అ॥ రామయ | 1-8 |
| అహల్యాసంక్రందనము | స॥ వేం॥ కృష్ణప్పనాయక | 1-8 |
| సత్యభామాసాంత్వనము | ,, ,, | 0-12 |
| మల్హణీయము | ఎ. ఎఱ్ఱయమహాకవి | 1-8 |
| కవిజనరంజనము | అ॥ సూరకవి | 1-0 |
| రాజవాహనవిజయము | కా॥ మూర్తి | 0-8 |
| పాంచాలీపరిణయము | ,, ,, | 0-8 |
| రాజశేఖరచరిత్ర | మా॥ మల్లన | 0-8 |
| మిత్రవిందాపరిణయము | రా॥ జ॥ రం॥ రా | 0-10 |
| శ్రీరంగమహాత్మ్యము | క॥ వ॥ రాజేంద్రకవి | 1-8 |
| సర్వకామదాపరిణయము | శి॥ కృష్ణమూర్తి | 0-10 |
| విజయనందనవిలాసము | మం॥ ఆనందకవి | 0-10 |
| వాల్మీకిచరిత్ర | రఘునాథభూపాల | 0-8 |
| ప్రబోధచంద్రోదయము | నం॥ మ॥ ఘం॥ సి॥ | 0-8 |
| శృగారరసాలవాలము | వె॥ వడ్డికవి | 1-0 |
| రాఘవయాదవపాండవీయము | అ॥ వీ॥ | 0-12 |
| ప్రభులింగలీలలు | పి॥ బ॥ | 0-8 |
| అహోబలపండితీయము | అ॥ సం॥ | 3-8 |

వలయువారు:- శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్ డిపో, రాజమండ్రి.